# ఇది మేజిక్!




**మేజిక్ దారం :**
దారం సహాయంతో నీళ్ల గ్లాసులో నుంచి మంచు ముక్కను పైకెత్తు!
**కిటుకు :**
దారం కొసను మంచు ముక్కపై ఉంచు. ఆ కొసపైన ఉప్పు రాల్చు. 20 దాకా ఎంచి, మంచు ముక్కను పైకెత్తు!



**నడిచే ఉంగరం :**
ఉంగరాన్ని బాగా నున్నని ఓ కర్రకు తగిలించు. ఉంగరం టేబిల్ పైభాగాన్ని తగిలీ తగలకుండ ఉండేలా చేసి కర్రను కదలకుండా పట్టి ఉంచు. ఇప్పుడు ఉంగరం కర్ర ఈ కొసనుండి ఆ కొసకు దానంతటదే కదిలి వెళ్తుంది.
**కిటుకు :**
గురుత్వాకర్షణే ఇందులోని కిటుకు.



**మేజిక్ కోడిగుడ్డు :**
మామూలు కోడిగుడ్డును గిరగిరా తిప్పి చూపమను ఎవరైనా. ఊహుం. ఎవరికీ చేతకాదు—నీకు తప్ప!
**కిటుకు :**
ఉడికి చల్లారిన గట్టి గుడ్డొకటీ, మామూలు గుడ్డొకటీ తీసుకో. ఉడికిన గుడ్డును గిరగిరా తిప్పి చూపు. పెద్ద మెజీషియన్ లాగా గర్వంగా కాలరెత్తుకో!

ఈ అద్భుతమైన మేజిక్ ట్రిక్కులు చేసి చూపించి నీ నేస్తాల్ని ఆశ్చర్యంలో ముంచెత్తు. చలాకీగా చేసి చూపడం నీవంతు, చిత్రంగా గుడ్లప్పగించడం వాళ్లవంతు.

అయితే ఇదిగో, అన్నిటికన్న సులువైన మరో ట్రిక్! నీ పేరు మీద స్టేట్ బ్యాంక్‌లో సేవింగ్స్ అకౌంట్ మొదలెట్టు. నీ వయస్సు 10 ఏళ్ల లోపయితే నీకోసం అకౌంట్ మొదలెట్టమని నాన్నతో చెప్పు. నీ జేబు ఖర్చుకిచ్చిన డబ్బు అందులో వేసుకో. అలాగే నీకొచ్చిన బహుమతి డబ్బులన్నీ కూడా వేసుకో. ఇక నీతోపాటే నీ పొదుపు డబ్బులు కూడా రెండింతలుగా, మూడింతలుగా పెరుగుతూ పోతాయి చూసుకో!

**పొదుపు చేసుకోడంలో పెద్ద మజా ఉంది మరి!**






# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళ కథ ["ఆశ్రమధర్మం"]కు ఆధారం జొన్నలగడ్డ రత్న రచన.

ఎంతటి అజ్ఞానికూడా, ఒక్క చిన్న సంఘటన ద్వారా జ్ఞానమార్గానికి మరలే అవకాశం వున్నది. ఈ విషయం, "జ్ఞాని-అజ్ఞాని" అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

ద్విజిహ్వా మానవః క్రూరః ద్విజిహ్వాదపి పన్నగాత్,
సర్పో హరత్యేకమేవ క్రూరస్తు కుల నాశకః.

[రెండు నాలుకలున్న సర్పం కంటే, అలాంటి లక్షణాలు వున్న మనిషే ఎక్కువ క్రూరుడు. సర్పం కాటువేసి ఒక్కనినే చంప గలదు; క్రూరుడు వంశనాశనానికే కారకుడవుతాడు.]

సంపుటి 72 జనవరి '83 సంచిక 1

విడి ప్రతి : 1-75 : : సంవత్సర చందా : 21-00








# రాజమ్మ పొదుపు

రాజమ్మకు పొదుపు ఎక్కువ. ముఖ్యంగా వండిన పదార్థాలేవీ అవతల పారవేయడం ఆమె కిష్టముండదు. ఒకరోజున ఆమె పక్కింటి కైలాసం కుటుంబాన్ని భోజనానికి పిలిచింది. కైలాసం తిండిపుష్టి కలవాడు. అందుకని రాజమ్మ వంటకాలన్నీ కాస్త ఎక్కువగా వండింది. అయితే, ఆ రోజు కైలాసం ఆరోగ్యం అంత బాగా లేదు. ఆ కారణంగా ఆయన అట్టే తినలేకపోయాడు. పదార్థాలు చాలా మిగిలిపోయాయి. అతిథులు వెళ్ళిపోయాక, "ఇవన్నీ ఏం చేసుకుంటాం? చాలా మిగిలిపోయాయి," అంటూ రాజమ్మ భర్త సీతయ్య కలవరపడ్డాడు.

"ఆ సంగతి నే చూస్తాలే," అన్నది రాజమ్మ.

భార్య పొదుపు గురించి బాగా తెలిసిన సీతయ్యకు, భార్య వాటిని తనచేత తినిపిస్తుందన్న అనుమానం కలిగింది. ఆయన మర్నాడు మొహం కడుక్కోగానే, కడుపు చేత్తో పట్టుకుని మెలికలు తిరిగిపోసాగాడు. ఏం జరిగిందంటూ భార్య దగ్గరకు రాగానే, కడుపులో పోట్లు వస్తున్నాయన్నాడు.

రాజమ్మ వైద్యుడికి కబురు పంపింది. వైద్యుడు వచ్చి సీతయ్యను పరీక్షించి, "రాత్రి ఏం తిన్నావేమిటి?" అని అడిగాడు. సీతయ్య చెప్పాడు.

"ఈ మాత్రం దానికే కడుపులో పోట్లు రాకూడదే! సరే, ఇంటికి వెళ్ళి మందు పంపిస్తాను. ఈ రోజుకు భోజనం మానేసెయ్యి," అన్నాడు వైద్యుడు.

రాజమ్మ వైద్యుడి కోసం పళ్ళెంలో ఫలహారం తీసుకు వచ్చింది. దాన్ని చూసి ఆయన కంగారుగా లేచి నిలబడి, "చూడమ్మా, ఈ రోజు నేను ఉపవాసం. మరేం అనుకోకు," అని వెళ్లిపోయాడు.

"వసుంధర"

"ఆయన ఉపవాసం, మీకు ఒంట్లో బాగులేదు! ఈ పదార్థాలన్నీ చెల్లుబడి అయేదెలాగా?" అన్నది రాజమ్మ దిగులుగా.

"ఆకలితో వున్న వాళ్ళనెవరినైనా పిలిచి, భోజనం పెట్టు. ఆకలి రుచి ఎరగదంటారు. నీకు పుణ్యం కూడా వస్తుంది," అన్నాడు సీతయ్య.

రాజమ్మ వీధి అరుగు మీదికి వెళ్ళింది. అలా పోతున్న మునసబుగారి పాలేరు కనబడ్డాడు. "ఏరా, అలా నీరసంగా కనబడుతున్నావు? ఇంకా ఏమీ తినలేదా?" అంటూ రాజమ్మ వాణ్ణి ఆప్యాయంగా పలకరించింది.

"అవునమ్మా, దేనికో కోపం వచ్చి అయ్యగారు నిన్న రోజంతా నన్ను గదిలో పెట్టి తాళం వేశారు. ఇప్పుడే వదిలారు," అన్నాడు పాలేరు.

"అయ్యో, పాపం! మా ఇంట్లో పిండి వంటలతో భోజనం సిద్ధంగా వుంది. భోంచేసి వెళుదువుగాని, పద," అన్నది రాజమ్మ.

రాజమ్మ మండువాలో విస్తరి వేసి, ఒక్కొక్క పదార్థమే వడ్డించసాగేసరికి పాలేరు కంగారుగా లేచి, "చూడండమ్మగారూ! మా ఇంట్లో వాళ్ళంతా, నేనేమయ్యానో అని, వెయ్యికళ్ళతో ఎదురు



చూస్తూంటారు. మరెప్పుడైనా, యింత తిండి పెడుదురుగాని," అంటూ వీధిలోకి వెళ్ళిపోయాడు.

"అదేమిటి, వాడు అలా వెళ్ళిపోయాడు?" అన్నది రాజమ్మ సీతయ్యతో.

"నువ్వు వడ్డించినవన్నీ, నిన్నటివని పసిగట్టాడేమో!" అన్నాడు సీతయ్య.

"అయితేనేం, ఆకలి రుచి ఎరగదుగా!" అన్నది రాజమ్మ.

"ఆకలికి రుచి తెలియక పోవచ్చు కానీ, వాసన తెలుస్తుంది! వాడేం ముష్టివాడు కాదుగదా," అన్నాడు సీతయ్య.

భర్త అలా అనగానే రాజమ్మ వీధి వాకిలి దగ్గిరకు వెళ్ళింది. ఒక ముష్టివాడు



అటుగా వస్తూ, "నాలుగు రోజుల్నించీ తిండిలేదు. పిడికెడు మెతుకులు పెట్టించమ్మా!" అన్నాడు.

"పిడికెడేం కర్మ, కడుపు నిండా తిందువుగాని, లోపలికి రా," అన్నది రాజమ్మ.

ఈసారి ఆమె మొత్తం పదార్థాలన్నీ విస్తట్లో పెట్టి తీసుకువచ్చి, ముష్టివాడి ముందు పెట్టింది. వాటి వాసన తగలగానే వాడు ఒకసారి రాజమ్మకేసి తలతిప్పి, బిర్రబిగుసుకు పడిపోయాడు.

రాజమ్మ కంగారు పడుతూ పోయి భర్తకు చెప్పింది. సీతయ్య, వాడు చచ్చిపోయి వుంటాడనుకుని, పక్క వీధిలో వున్న పురోహితుడి ఇంటికి వెళ్ళి, జరిగిన సంగతి చెప్పాడు.

"దాందేముందీ, అనాథ ప్రేతానికి దహన సంస్కారం చేయిస్తే, ఎంతో పుణ్యం. నువ్వది చేయించు. ఇంట్లో వండిన పదార్థాలన్నీ నాకు దానంచెయ్యి," అన్నాడు పురోహితుడు.

ఆయన సీతయ్య వెంట వచ్చి, ముష్టివాణ్ణి చూస్తూ, "శవం అప్పుడే వాసన కొడుతున్నదే!" అన్నాడు.

"అది శవం వాసన కాదండీ, వాడి ముందు పడ్డించిన పదార్థాలు నిన్నటివి!" అన్నాడు సీతయ్య.

పురోహితుడు ఉలిక్కిపడి, "ఇది అనాథప్రేత సంస్కారం కదా, ఇలాంటి దానికి నేను దానం పట్టకూడదు. అంతే కాదు; వీడు ఆకలితో ఆక్రోశిస్తూ చనిపోయాడు. అందువల్ల, ఇంట్లోవున్న వండిన పదార్థాలన్నీ శవంతో పాటు చితిలో వేస్తే, వీడి ఆత్మశాంతిస్తుంది!" అన్నాడు.

సీతయ్య సంతోషంగా, "ముందు చితిలో వండిన పదార్థాలన్నీ వేసి, తరవాత వీణ్ణి వేస్తే సరిపోతుందిగదా?" అన్నాడు.

ఆ వెంటనే ముష్టివాడు లేచికూర్చుని, "వాటిని ముందే నిప్పుల్లో వేస్తే, నన్ను నిప్పుల్లో వేసే పనేలేదు," అంటూ వీధిలోకి పరిగెత్తాడు.

జరిగిందేమిటో అర్థం చేసుకోవడానికి పురోహితుడికి కొద్దిసేపు పట్టింది, ఇంటికి పిలిచి అన్నం పెట్టిన ఇల్లాలిని కాదనలేకా, ఆమె పెట్టిన భోజనం తినలేకా-బిచ్చగాడు చచ్చినట్టు పడుకుని, చితి మాట వినగానే లేచి పారిపోయాడు. పురోహితుడూ, సీతయ్యా పెద్దగా నవ్వసాగారు. రాజమ్మకు చచ్చేటంత అవమానమై పోయింది.

ఆమె కోపంగా, "నేనేమన్నా, నా కోసమని పాడుచేస్తున్నానా? నేను ఆదా చేస్తే, నీకే డబ్బు మిగులుతుంది. నీకంత వేళాకోళంగా వుంటే, ఇప్పుడే ఆ పని చేస్తాను," అంటూ భర్తకేసి కోపంగా చూసి లోపలికిపోయి, వంటకాలన్నీ నిప్పుల్లో వేసి వచ్చింది.

"నా కడుపులో పోట్లు తగ్గిపోయాయి. ఆకలేస్తున్నది. త్వరగా అన్నం వండు," అన్నాడు సీతయ్య.

"అయితే, మీజబ్బు కూడా దొంగజబ్బే నన్నమాట!" అని రాజమ్మ విసుక్కున్నది. భార్యా భర్తల గొడవ మధ్య తనెందుకని పురోహితుడు మెల్లగా అక్కణ్ణించి జారుకున్నాడు.

ఆ సమయంలో వైద్యుడు హడావిడిగా ఇంట్లోకి వస్తూనే, "సీతయ్యా! మందు పంపడానికి ఎవరూ దొరక లేదు. నేనే తెచ్చాను. ఆలస్యానికి ఏమీ అనుకోకు," అన్నాడు.

"ఎందుకూ, వారిదంతా దొంగజబ్బు!" అని రాజమ్మ, వైద్యుడికి జరిగినదంతా చెప్పింది.

"అయితే, యింకేం! ఆ పదార్థాలన్నీ నిప్పులో వేశావు గనక, నేనూ ఉపవాసం మానేశాను, నాకూ విస్తరి వెయ్యి," అన్నాడు వైద్యుడు.

"అందరికీ, అందరే!" అని రాజమ్మ విసుక్కుంటూ వంటగదిలోకి వెళ్ళింది.

ఆనాటినుంచీ ఆమె వండిన పదార్థాలేమైనా మిగిలిపోతూంటే, వాటిని అప్పటికప్పుడే ఎవరికైనా యివ్వడం అలవాటు చేసుకున్నది.



# ఉబుసుపోని ప్రశ్న

ఒక రాజు తన ఆస్థానసభికుల్ని, అప్పుడప్పుడూ ఉబుసుపోక ఏవేవో ప్రశ్నలడుగుతూండే వాడు. అలాంటి ప్రశ్నలకు హాస్యం జోడించి జవాబులిచ్చి, సభికులను నవ్వించేవారికి మంచి బహుమానాలిస్తూండేవాడు. ఒకసారి ఆయన, "బజార్లో అన్ని వస్తువుల్లాగే తెలివి కూడా కొనేందుకు దొరకడం ప్రారంభమైతే, అప్పుడెలాంటి పరిస్థితి ఏర్పడుతుంది?" అని అడిగాడు.

ఒక సభికుడు లేచి, "మహారాజా, తెలివి కొనేందుకు దొరికితే, దేశంలోని మూర్ఖు లంతా దాన్ని ఎగబడి కొంటారు. ఇక దేశంలో మూర్ఖుడన్నవాడుండడు," అన్నాడు.

రాజుకు యీ జవాబు నచ్చినట్టు అనుమానం కలిగి ఆస్థాన విదూషకుడు, "మహా రాజా, అలా జరగడం అసంభవం. తెలివి అమ్మకానికి దొరికినా, దేశంలో మూర్ఖుల శాతం తగ్గదు," అన్నాడు. "అదెలాగో నిరూపించు," అన్నాడు రాజు.

"ప్రతి వ్యాపారీ ఎక్కువ లాభాన్ని ఆశిస్తాడు. తెలివిని కొనుక్కొని మూర్ఖులంతా తెలివైనవాళ్ళయిపోతే, యిక తెలివిని కొనేవాడుండడు. అందువల్ల వ్యాపారి తెలివి పేరు చెప్పి, మూర్ఖులకు మరేదో అమ్ముతాడు. మూర్ఖులు, మూర్ఖులుగానే వుండిపోతారు," అన్నాడు విదూషకుడు.

"కొనేవాళ్ళు, తాము కొంటున్నది తెలివో కాదో అన్న సంగతి తెలుసుకోలేరా?" అన్నాడొక సభికుడు.

"తెలుసుకోలేరు. తెలివిని కొనేందుకు వచ్చేవాళ్ళంతా మూర్ఖులేగదా!" అన్నాడు విదూషకుడు. ఈ జవాబుకు సభికులు నవ్వారు. రాజు విదూషకుడికి మంచి బహుమానం యిచ్చాడు.

—మహబూబ్ బాషా






## 15

[శివదత్తుడూ, మందరదేవుడూ, తాము చేరిన ద్వీపంలో ఒక విచిత్రవ్యక్తిని కనుగొన్నారు. వాడు, తను శమనద్వీపవాసిననీ, సముద్రకేతుడని పిలవబడే ఒక ఓడదొంగ పన్నెండేళ్ళక్రితం, తనను ఆ ద్వీపంలో వదిలిపోయాడనీ చెప్పాడు. ఆ తర్వాత, అందరూ భోజనాల దగ్గిర కూర్చోబోయే సమయానికి, తీరం వెంట వికృతమైన కేకలు వినిపించినై. తరవాత-]

శివదత్తుడూ, మందరదేవుడూ కత్తులు దూసి, పొదలచాటున నక్కుతూ, దాపులనే వున్న సముద్రతీరం కేసి బయలు దేరారు. వారి అనుచరులలో యిద్దరు మాత్రం వెనక వుండిపోయారు. వజ్రముష్టి చెట్ల కింది నుంచి పాకుతూ, అందరికన్న ముందు సముద్రతీరం చేరి, వెనుక వస్తున్నవారి కేసి జాగ్రత్త అన్న సూచనగా చేయి వూపాడు.

అందరూ నిశ్శబ్దంగా చెట్ల సందు నుంచి సముద్రం కేసి చూశారు. తీరం నుంచి ఒక వెయ్యి గజాల దూరంలో చిన్న నౌకాయుద్ధం జరుగుతున్నది. ఆ యుద్ధంలో పాల్గొంటున్నవి మొత్తం ఆరు పడవలు. అసలే అల్లకల్లోలంగా వున్న సముద్రంలో అవి ఒకదానినొకటి తాకుతున్నవి. ఆయుధాలు ధరించిన అనేకమంది యోధులు ఒక పడవమీంచి,



మరో పడవ మీదికి దూకుతూ, తళతళ లాడే కత్తులతో బాహాబాహి యుద్ధం చేస్తున్నారు.

ఉన్నట్టుండి హఠాత్తుగా నల్లని వికృతాకారుడొకడు నోటితో కత్తి పట్టుకుని, ఒక పడవ తెరచాప మీదికి సగంవరకూ పాకి, అక్కణ్ణించి కత్తిని కుడిచేత్తో ఝళిపిస్తూ, "జై కాలకేయా!" అంటూ అరిచి, మరో పడవ మీదికి దూకాడు.

ఇక, ఆ క్షణం నుంచీ పోరాటం మరీ భీకరంగా సాగింది. ఇరు పక్షాల యోధుల్లో కొందరు చేతులూ, తలలూ తెగి పడవల నించి దభీమని సముద్రంలో పడిపోతున్నారు. శిరస్త్రాణంలో ఒంటి కొమ్ము ధరించివున్న, ఆ నల్లని వికృతాకారుడు భీకరంగా అరుస్తూ, ఒక పడవమీంచి ఇంకో పడవ మీదికి లాఘవంగా కత్తి గిరగిరా తిప్పుతూ కుప్పిగంతులు వేస్తున్నాడు.

"అయ్యో, వాడే సముద్రకేతుడు! క్రూరాతిక్రూరుడైన సముద్రపు దొంగ!" అన్నాడు వజ్రముష్టి, శివదత్తుడితో.

శివదత్తుడూ, మందరదేవుడూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. ఆ వికృతాకారుడు సముద్రకేతుడని తెలియగానే, ఇప్పుడు జరుగుతున్న యుద్ధం ఆ బందిపోటు ముఠాకూ, సముద్రం మీద పోతున్న మరేదో వర్తకుల పడవలకూ మధ్య అని శివదత్తుడు వూహించాడు. ఇప్పుడు ఏమి చేయుటమా అని అతడు ఆలోచించేటంతలో, ఒక చిన్న తొట్టె పడవలాటిది తక్కిన పెద్ద పడవల నుంచి క్రమంగా వేరై నెమ్మదిగా తీరం కేసి రాసాగింది.

శివదత్తుడూ, మందరదేవుడూ ఆశ్చర్యచకితులయ్యారు. ఆ చిన్న పడవ తీరం కేసి బయలుదేరటం, యుద్ధం చేస్తున్న వారెవరూ గుర్తించినట్టులేదు. వాళ్ళు మామూలుగానే కేకలు పెడుతూ, పడవల మీది నుంచి దూకుతూ, ఒకరి నొకరు కత్తులతో నరుక్కుంటున్నారు.

కొద్ది కాలం గడిచింది. హఠాత్తుగా సముద్రకేతుడు పెద్ద కేక పెట్టి, "హేయ్! వాళ్ళు పారిపోతున్నారు. ఈదుకుపోయి ఆ పడవను పట్టుకోండి!" అంటూ అరిచాడు.

వెంటనే సముద్రపు దొంగల ముఠా లోని కొందరు సముద్రంలోకి దూకి, చిన్న తొట్టె పడవకేసి వేగంగా యీదసాగారు. వాళ్ళ వెంటనే మరికొందరు దూకి, ఈదుకుపోతున్న ఆ దొంగలను వెనక నుంచి తమ కత్తులతో ఎదుర్కొన్నారు.

ఇప్పుడు, ఇరుపక్షాలవాళ్ళూ సముద్ర జలంలో ఈదుతూనే, ఒకరితో ఒకరు వీలయితే కత్తులతో, లేకపోతే ముష్టా ముష్టి కలియబడి పోరాడసాగారు.

"ఈ యుద్ధం మరీ విచిత్రంగా ఉంది. ఒకవైపు నీటిలో ఈదుతూనే, మరోవైపు శత్రువును చంపజూడటం....యిలాంటి యుద్ధం నేనెక్కడా చూడలేదు!" అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడు అవునన్నట్టు తలపూపాడు. అతడి దృష్టి ఒకమారు పోరాటం జరుగుతున్న పడవలకేసీ, మరోమారు తీరం సమీపిస్తున్న తొట్టెపడవ కేసీ ప్రసరిస్తున్నది. ఈ రెండింటికీ మధ్యగా సముద్రంలో ఈతగాళ్ళ మధ్య భయంకర రణం సాగుతోంది.




క్రమంగా తొట్టెపడవ తీరాన్ని సమీపించింది. ఇంకా ఒడ్డు ఐదారు గజాలు ఉండనగానే, అందులోంచి ఇద్దరు స్త్రీలు నీళ్ళలోకి దూకి గబగబా ఒడ్డు చేరారు. మరుక్షణంలో సముద్రకేతుడి భీకర స్వరం సముద్రంమీద మార్మోగింది. వెంటనే రెండు పడవలు తీరం కేసి బయలుదేరినై. మునిగిపోతున్న రెండు పెద్ద పడవలలోనుంచి కొందరు హృదయ విదారకంగా అరవసాగారు.

"మందరదేవా! ఇక మనం బయట పడక తప్పదు," అన్నాడు శివదత్తుడు. "ఆ పారిపోతున్న స్త్రీలు ఎవరన్నది ప్రస్తుతానికి అనవసరం. మనం వెంటనే




ఆ బందిపోటు సముద్రకేతుణ్ణి ఎదిరించకపోతే, వాళ్ళిద్దర్నీ అతడు సునాయాసంగా దొరకపుచ్చుకుంటాడు.''

మందరదేవుడు వెనుదిరిగి చూశాడు. అతడికి ముగ్గురు సైనికులూ, వజ్రముష్టి మాత్రం కనిపించారు. ''తక్కిన ఇద్దరూ ఎక్కడ?'' అని ఒక సైనికుణ్ణి మందరదేవుడు ప్రశ్నించాడు.

''అయ్యో, వాళ్ళిద్దరూ భోజనసామగ్రి దగ్గిరే వుండిపోయారు!'' అన్నాడు, ఆ సైనికుడు వెనుదిరిగి చూస్తూ.

''వెంటనే వాళ్ళను ఇక్కడకు పిలుచుకురా!'' అని మందరదేవుడు ఆ సైనికుణ్ణి ఆజ్ఞాపించాడు.

సైనికుడు వెనుదిరిగి బయలుదేరేంతలో శివదత్తుడు అతడిని ఆపి, ''మందరదేవా, మనం అందరం కలిసి ఎనిమిది మందిమి మాత్రమే! సముద్రకేతుడి బందిపోటు ముఠా యాభై, అరవైకి పైబడే ఉన్నట్టు కనబడుతోంది. మనం వాళ్ళను ఎదుర్కొవాలంటే, ఒక ఉపాయం వుంది!'' అన్నాడు.

ఏమిటదీ అన్నట్టు మందరదేవుడు శివదత్తుడి కేసి చూశాడు.

''మనం ఇంత స్వల్ప సంఖ్యలో ఉన్నట్టు సముద్రకేతుడు తెలుసుకోవటం మహా ప్రమాదం. అందుకని, మనం అయిదుగురం చెట్లచాటునుంచి, ఒక్కసారిగా సహస్ర కంఠాలతో అరిచినట్టుగా, భీకరంగా అరుస్తూ, వాళ్ళమీదకు ఉరుకుదాం. ఇక మిగిలిన ముగ్గురూ, ఆ బందిపోటులను వెనుకనుంచి మనలాగే అరుస్తూ ఎదుర్కొంటారు!'' అన్నాడు శివదత్తుడు.

మందరదేవుడు అంగీకరించాడు. భోజనాల దగ్గిర ఉన్న ఇరువురు సైనికులకూ ఈ సంగతి చెప్పి, వాళ్ళతో పాటు బందిపోటు ముఠాను వెనుక నుంచి ఎదుర్కొవలసిందిగా ఆ సైనికుడు ఆజ్ఞాపించబడ్డాడు.

క్రమంగా, సముద్రకేతుడున్న పడవలు రెండూ తీరం చేరసాగినై. సముద్రంలో

పోరాటం చల్లారింది. రెండు పడవలు మునిగిపోగా, మిగిలిన రెండు పడవలనూ, సముద్రకేతుడి బందిపోట్లు వశపరుచుకుని, వాళ్లూ తీరం కేసి బయలుదేరారు. వాళ్ళకు దారిలో నీట తేలుతూ పోరాడుతున్నవాళ్ళు కనిపించగానే, తమ వాళ్ళను పడవలలోకి లాగుతూ, శత్రువులను, పడవమీద ఉండే, కత్తులతో తుదముట్టించసాగారు.

శివదత్తుడు ఆ భయంకర దృశ్యంకేసి ఓమారు చూసి, "మందరదేవా! ఆ బందిపోట్లు మొత్తం మీద అందరినీ హతమారుస్తున్నారు. ఇక, ఆ స్త్రీలను రక్షించేభారం మనం వహించవలసిందే!" అన్నాడు.

మందరదేవుడు సాలోచనగా తలవూపి, "ఇక మనం బయలుదేరుదాం!" అంటూ రెండడుగులు ముందుకు వేసి పక్కనే వస్తున్న వజ్రముష్టికేసి చూసి, "అరెరే, వజ్రముష్టి నిరాయుధుడు! ఆ సంగతి ఇంత వరకూ మనం గమనించనేలేదు," అన్నాడు ఆశ్చర్యపోతూ.

ఆ మాటలకు వజ్రముష్టి నవ్వాడు. అయ్యా, నాకు కావలిసిన కత్తిని నేనే సంపాయించుకోగలను. వీలైతే, ఆ సముద్రకేతుణ్ణి నా చేతులమీదుగా హతమార్చాలని ఆశగావుంది," అన్నాడు.



అందరూ అక్కడి నుంచి బయలుదేరారు. వజ్రముష్టి ఆ ప్రాంతమంతా బాగా ఎరిగి వున్నవాడు. కనక, ముందు దారి తీశాడు. ఒడ్డుకు చేరిన స్త్రీలిద్దరూ, వెనుదిరిగి ఒకసారి సముద్రంకేసి చూసి, తమను సముద్రకేతుడు వెంబడిస్తున్నాడని గ్రహించి, భయకంపితులై అక్కడ ఉన్న గుబురు చెట్లలోకి గబగబా పరిగెత్తారు.

ఇంతలో సముద్రకేతుడు ఉన్న పడవలు రెండూ తీరం చేరినై. అతడు కత్తి పైకెత్తి, "జై కాలకేయా!" అంటూ నీటిలోకి ఉరికి, వెనుదిరిగి తన అనుచరుల కేసి చూస్తూ, "ఆ స్వయంప్రభకు

మాత్రం పోని కలగకూడదు! ఆ ముసలి దాన్ని కత్తికి ఎర చేయండి,'' అన్నాడు భీకరంగా.

సముద్రకేతుడు మోకాటి నీటిలో నడిచి ఒడ్డు చేరాడు. అతడి వెనకనే, ఇరవైమంది సముద్రపు దొంగలు కూడా ఒడ్డెక్కారు. అందరూ ఆ స్త్రీలు పారిపోయిన గుబురు చెట్లకేసి నిశ్శబ్దంగా బయలుదేరారు.

''మనం, ఎలాగైనా ఆ ప్రదేశాన్ని ముందు చేరటం అవసరం. వాళ్ళు చెట్లను సమీపించేంతలో, అందరం ఒక్కమారు అరుస్తూ, వాళ్ళ మీదకు దూకుదాం. విజయమో, వీరస్వర్గమో....'' అన్నాడు శివదత్తుడు.

''అంతా మరాళదేవి కరుణ!'' అంటూ మందరదేవుడు కత్తి పైకెత్తి ఓమారు నమస్కరించాడు.

అందరూ ఆ చెట్లగుంపులో జొరబడి, కత్తులు దూసి సిద్ధంగా వున్నారు. పారిపోయి వచ్చిన స్త్రీల అలికిడి ఎక్కడా లేదు. ''బహుశా, వాళ్ళు ఇంకా లోపలకు పారిపోయి వుంటారు!'' అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడు తల వూపి, ''ఒకసారి, ఈ సముద్ర దొంగలను పారదోలితే తరవాత వాళ్ళెక్కడ దాగిందీ తెలుసుకోవటం ఏమంత కష్టం కాదు,'' అన్నాడు.

సముద్రకేతుడు తన అనుచరులతో క్రమంగా చెట్ల గుంపుకేసి రాసాగాడు.



వజ్రముష్టి అక్కడ ఎత్తుగా పెరిగిన ఒక చెట్టుమీదికి పాకి, కిందకు వంగి వున్న ఒక కొమ్మమీద పాములా పడుకున్నాడు.

సముద్రకేతుడు అనుచరులతో ఆ చెట్టు కిందికి రాగానే, "జై కాలకేయా!" అంటూ అతడు వారి మధ్యకు మెరుపులా దూకాడు.

అదే సమయంలో "జైమరాళీ!" అంటూ శివదత్తుడూ, మందరదేవుడూ, సైనికులతో చెట్లమాటు నుంచి ఒక్కమారు బయట పడి, సముద్రకేతుడి మీదికి లంఘించారు.

కనురెప్పపాటు కాలం, సముద్రకేతుడు నివ్వెరపోయాడు. ఈలోపల వజ్రముష్టి, సముద్రపు దొంగలలో ఒకడినుంచి కత్తి గుంజుకుని, సింహంలా గర్జిస్తూ ఒకరిద్దరు శత్రువులను హతమార్చాడు.

ఆ సరికి సముద్రకేతుడు తెప్పరిల్లాడు. అతడు తన అనుచరులను ప్రోత్సహిస్తూ, "జై కాలకేయా!" అని అరిచి, శివదత్తుడి మీదికి ధూకాడు. అప్పటికే అతడి అనుచరులు కొందరు వెన్ను చూపి సముద్రం కేసి పరిగెత్తసాగారు.

ఇంతలో మరొకవైపు నుంచి, ముగ్గురు సైనికులు భీకరంగా అరుస్తూ, దొంగల మీదికి వెళ్ళారు.

సముద్రకేతుడు బెదరలేదు. అతడు శివదత్తుడితో యుద్ధం చేస్తూనే కొంచెం, కొంచెంగా వెనక్కు జరుగుతూ, "పారిపోకండి. నిలబడండి, శత్రువులు ఎనిమిది మందికన్న ఎక్కువలేరు!" అని అరవసాగాడు



ఆ కేకలకు పారిపోతున్న అతడి అనుచరులు వెనుదిరిగి, ధైర్యం తెచ్చుకుని, తిరిగి శివదత్తుడి సైనికుల మీద యుద్ధానికి తలబడ్డారు.

నాలుగైదు నిముషాల సేపు పోరు ముమ్మరంగా సాగింది. వజ్రముష్టిని నలుగురైదుగురు బందిపోట్లు చుట్టుముట్టారు. కాని, అతడు అందరి కత్తిదెబ్బలనూ కాచుకుంటూ, తన చేతిలోని కత్తిని మెరుపులా తిప్పుతూ, వాళ్ళలో కొందరిని గాయపరిచాడు.

గాయపడినవాడు ఒక్క చావుకేక పెట్టి వెనుకకు పడిపోగానే, మరుక్షణంలో ఆ స్థానాన్ని మరొకడు ఆక్రమించుకుంటున్నాడు.

పోరాటం, ఈ విధంగా మరెంతో కాలం సాగదని శివదత్తుడు గ్రహించాడు. అతడు, తనకన్న తక్కువ వయసువాడూ, మహాబలశాలీ అయిన సముద్రకేతుడితో యుద్ధం చేస్తూనే, ఒక కంట సముద్రతీరం చేరుతున్న శత్రువుల పడవలు రెంటినీ కనిపెడుతూనే ఉన్నాడు. ఆ పడవలలో నుంచి మరికొందరు శత్రువులు ఒడ్డు చేరితే, ఆ తరవాత అందరూ కలిసి తననూ అనుచరుల్నీ కూడా చుట్టుముట్టగలరు. ఈ పరిస్థితుల్లో తను అనుచరులతో పాటు వెనుకకు తగ్గటమే మంచిదని అతడు నిర్ణయించుకున్నాడు. ఈ సరికి, తను రక్షించదలచిన స్త్రీలిద్దరూ, అడవిలో చాలా దూరం పారిపోయి వుంటారని అతను భావించాడు.

శివదత్తుడు, "జై, మరాళీ!" అంటూ ఒక్క కేకవేసి, సముద్రకేతుణ్ణి కుడికాలుతో బలంగా తన్ని, అతడు వెనక్కు పడబోయి, తిరిగి కాలూనుకునేంతలో పెద్దగా తన అనుచరులను హెచ్చరించి, చెట్ల గుంపుకేసి పరిగెత్తాడు. అదే సూచనగా, అతని అనుచరులు కూడా వెనుకడుగు వేశారు.

కళ్ళుమూసి తెరిచేంతలో, శివదత్తుడూ, అతడి అనుచరులూ చెట్ల చాటుకు పారిపోయారు. —(ఇంకా వుంది)






# ఆశ్రమధర్మం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, సమాజంలో ప్రజాపాలకులైన రాజుల కుండే గౌరవ మర్యాదలు, వేదాంతు లకూ, తత్వజ్ఞులకూ, సాధు సన్యాసు లకూ వుండడం నీకు తెలియని విషయం కాదు. కాని, సమాజ క్షేమాభివృద్ధుల పట్ల వాళ్ళ ఆలోచనలూ, అంచనాలూ భిన్నంగా వుండడమే కాక, ఒక్కొక్క సారి పరస్పర విరుద్ధంగా వుండడం కూడా జరుగుతుంది. ఈ అర్ధరాత్రివేళ, ఎంతో శ్రమతో కూడిన యీ పనికి నిన్ను పురిగొల్పినవాడు, వాళ్ళల్లో ఎవరై వుంటారన్న అనుమానం నాకు కలుగు తున్నది. శ్రమతెలియకుండా వుండేం

## బేతాళ కథలు



దుకు నీకు సహజానందుడనే తత్వజ్ఞుడి కథ చెబుతాను విను,'' అంటూ యిలా చెప్పసాగాడు:

ప్రవాళదేశంలోని ముఖ్య నగరాలలో ఒకటైన రాజగిరికి వెలుపల, సహజానందుడనే పండితుడు ఆశ్రమం నిర్మించుకుని శిష్యులకు తత్వ, వేదాంత శాస్త్రాలు బోధిస్తూండేవాడు. ఆయన ఎనభై ఏళ్ళ పండు ముదుసలి. ఆశ్రమవాసి కాక పూర్వం ఆయన ప్రవాళదేశ రాజకుటుంబీకులకు విద్యాబోధనలో ముఖ్యోపాధ్యాయుడుగా వుండేవాడు. దేశప్రజలందరికీ ఆయనపట్ల ఎంతో భక్తి విశ్వాసాలుండేవి.

ప్రాకారపురం ప్రవాళదేశ రాజధానీ నగరం. రాజు నందికేశ్వరుడు సమర్థుడైన పరిపాలకుడు. ఆయన తన రాజ్యంలోని ముఖ్య నగరాలన్నిటికీ యోగ్యులూ, శక్తిమంతులూ అయిన వారిని ప్రధానాధికారులుగా నియమించేవాడు.

ఒకసారి రాజగిరి నగరాధికారిని గురించి నందికేశ్వరుడికి కొన్ని ఫిర్యాదులు అందినై. ఆ నగర ముఖ్యాధికారి అసమర్థుడనీ, నగరం, దాని చుట్టుపక్కలా తీవ్రమైన అరాజక పరిస్థితులేర్పడినవనీ ప్రజలు రాజుకు విన్నవించుకున్నారు. అక్కడ జరుగుతున్న అన్యాయాలకూ, అక్రమాలకూ కారకుడు దుర్జయుడనేవాడు. వాడు మహారాణికి ప్రీతిపాత్రుడైన బంధుకోటిలో ఒకడు కావడంతో, నగరాధికారికి అతణ్ణి అదుపులో పెట్టడం సాధ్యం కాలేదు. పైగా, దుర్జయుడు ఎంత కాలంగానో తానే నగరపాలకుడు కావాలన్న ప్రయత్నంలో వున్నాడు.

రాణీగారి బంధువైన దుర్జయుడి ఆగడాలను గురించి రాజుకు చెప్పడం చిక్కులకు కారణం అవుతుందేమో అని భావించిన మంత్రి, రాజుతో, ''మహారాజా, రాజగిరికి మరొక కొత్త అధికారిని పంపడం అవసరంగా కనబడుతున్నది.

అందుకు అన్ని విధాలా సమర్థుడైన యువకుడు ప్రతాపు డనేవాడు మన ఆస్థానంలో వున్నాడు. అతణ్ణి పంపమని సెలవా ?'' అన్నాడు.

రాజు అందుకు అంగీకరించాడు. మంత్రి ఆనాడే ప్రతాపుణ్ణి పిలిపించి, రాజుగారు అతణ్ణి రాజగిరి ప్రధానాధికారిగా నియమించాడనీ, వెంటనే బయలుదేరి పోవలసిందనీ చెప్పాడు.

ప్రతాపుడికి మంత్రిపట్ల ఎంతో భక్తి విశ్వాసాలున్నవి. అయినా, యీ నియామకం అతడికి చాలా బాధ కలిగించింది. తనలాంటి సమర్థుడైనవాణ్ణి, రాజధాని నుంచి తప్పించి దూరంగా పంపేందుకు మంత్రి అసూయకొద్దీ యిలా చేశాడని అపోహపడ్డాడు. పైగా, తాను పుట్టిపెరిగిన పరిసరాలను వదిలి దూరంగా పోవలసి రావడం అతడిలో నిరాశా, నిస్పృహలకు కారణమయింది. అయినా రాజాజ్ఞ కనక తప్పదు!

ప్రతాపుడు అయిష్టంగానే రాజగిరికి బయలుదేరాడు. అతడున్న రథానికి ముందూ, వెనుకా పదిమంది గుర్రపు రౌతులు సాయుధులై కదిలారు. ఒకనాటి ఉదయంవేళ రథం రాజగిరిని సమీపిస్తూండగా, ప్రతాపుడికి చెట్లకింద తన ప్రధానశిష్యుడైన చిన్మయుడితో ఏదో చర్చిస్తున్న సహజానందుడు కనిపించాడు. బ్రహ్మతేజస్సు ఉట్టిపడుతున్న ఆయన రూపం, ప్రశాంతమైన ఆశ్రమ వాతావ





రణం చూస్తూనే, ప్రతాపుడిలో వైరాగ్యం మొలకెత్తింది.

ప్రతాపుడు రథం దిగి ఆశ్రమంలో ప్రవేశించాడు. దూరాన్నుంచి యిది చూసిన సహజానందుడు శిష్యుడితో అతణ్ణి సమీపించాడు.

ప్రతాపుడు, సహజానందుడికి మోకరిల్లి, "నా పేరు ప్రతాపుడు. మన రాజధాని ప్రాకారపురం నుంచి వస్తున్నాను. మహారాజు నన్ను రాజగిరి పట్టణానికి పాలకుడుగా నియమించారు. పదవి స్వీకరించే ముందుగా, తమ దర్శనం కావడం, నా అదృష్టం! ఈ ఆశ్రమం, యిక్కడి ప్రశాంత వాతావరణం, వీటన్నిటినీ మించి తమ సాన్నిధ్యం—ఇవన్నీ చూశాక, యిక నాకెలాంటి పదవులూ నిర్వహించాలని లేదు. తమరు అంగీకరిస్తే తమ శిష్యులలో ఒకడుగా యిక్కడే వుండిపోవాలని వున్నది," అన్నాడు.

సహజానందుడు ఒక క్షణకాలం ప్రతాపుడి కేసి పరీక్షగాచూసి, తరవాత కోపంగా, "నేను సర్వసంగ పరిత్యాగినైన సన్యాసిని కాను; లోక వ్యవహారాల పట్ల ఆసక్తితో న్యాయాన్యాయ, ధర్మాధర్మాలను గురించి చర్చించే తాత్వికుణ్ణి. నిన్ను గురించి నాకు సర్వం తెలుసు. ఇంత చిన్న వయస్సులో అంత వైరాగ్యం చూపించ వలసిన అవసరం లేదు. నిన్ను శిష్యుడుగా స్వీకరించను," అన్నాడు.

ప్రతాపుడు, సహజానందుడికి నమస్కారం చేసి, మారు మాట్లాడకుండా రథం ఎక్కి వెళ్ళిపోయాడు.

కొద్దిసేపటి తరవాత, కొందరు అనుచరులు వెంటరాగా దుర్జయుడు పల్లకీలో వచ్చి, ఆశ్రమం ముందు దిగుతూనే సహజానందుడికి పాదాభివందనం చేసి, "ఈ వేసవిలో తమకు సదుపాయంగా వుంటుందని, ఆశ్రమం తోటలో పాలరాతి మంటపం కట్టేందుకు పనివాళ్ళను పంపాను. కాని, తమరు వద్దన్నారట. తమకు యీపాటి సేవ చేసుకునేందు

కూడా నేను అర్హుణ్ణి కానా?'' అన్నాడు వినయంగా.

సహజానందుడు మందహాసం చేస్తూ, ''నీ సేవల మాట అటుంచి, పాలరాళ్ళతోనూ, పట్టుపరుపులతోనూ, నా బోటి పండితులకు బద్ధవైరం అన్న సంగతి నీకు తెలియంది కాదుగదా! నాకు సేవ చేయడమే అంత ముఖ్యమని నువ్వనుకుంటే, ఆశ్రమంలోనే ఎందుకు వుండి పోగూడదు?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు దుర్జయుడు గతుక్కుమని, ''గురుదేవా, నేను నగరంలో ఎన్నో వ్యవహారాలతో, వ్యాసంగాలతో తల మునకలవుతున్నవాడిని. అయినా, తమను సదా మనసులో ధ్యానిస్తూనే వున్నాను. అటువంటప్పుడు ఆశ్రమంలోనే వుండవలసిన అవసరం ఏమున్నది?'' అన్నాడు.

ఈ జవాబుకు సహజానందుడు కోపంగా, ''దుర్జయా, నేను కోరి నిన్ను ఆశ్రమంలో మా మధ్య వుండమని ఎన్నోసార్లు ఆహ్వానించాను. అయినా, ఎందుకనో నువ్వు సందేహిస్తున్నావు. దీన్ని బట్టి నీకు, నా పట్ల త్రికరణశుద్ధిగా గురుభావం లేదని తేలిపోతున్నది. ఏదో స్వలాభం ఆశించే నా పై భక్తిగౌరవాలు నటిస్తున్నావన్న అనుమానం కూడా కలుగుతున్నది. కనీసం ఒక్క ఆరు మాసాల



కాలం పాటయినా, ఆశ్రమంలో ఎందుకు వుండిపోగూడదు?'' అన్నాడు.

ఎన్నడూ సహజానందుడు కోపగించుకోవడం ఎరగని దుర్జయుడు, ఆయన మాటలకు వణికిపోతూ, ''నేను ఆశ్రమవాసం స్వీకరించాలన్నదే గురువాజ్ఞ అయితే, యీ క్షణం నుంచే యిక్కడ వుండిపోతున్నాను,'' అన్నాడు.

సహజానందుడు తృప్తిగా తలాడించాడు. కాని, ఆయన ప్రధాన శిష్యుడు చిన్మయుడికి మాత్రం తన గురువుగారికేమన్నా మతిచాంచల్యం కలిగిందా అన్న అనుమానం వచ్చి, ఆయన కేసి తేరిపార చూశాడు.

బేతాళుడు యీ కథ చెప్పి, "రాజా, సహజానందుడిని గురించి చిన్మయుడికి కలిగిన అనుమానంలాటిదే, నాకూ కలుగుతున్నది. ఆశ్రమవాసం తనకు తానై కోరిన ప్రతాపుణ్ణి అనర్హుడి కింద జమకట్టి, కోప గించుకుని ఆయన పంపివేయడం ఆశ్చర్యంగా లేదా? అదే సమయంలో, రాజగిరి నగరంలో పరమదుష్టుడని పేరుమోసిన దుర్జయుణ్ణి, ఆశ్రమంలో తనకు శిష్యుడుగా వుండమని ఆహ్వానించడం వింతగా లేదా? సహజానందుడి యీ వింత ప్రవర్తనకు కారణం ఏమిటి? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సహజానందుడి ప్రవర్తనను గురించి ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. ఆయన పండితుడుగా, తత్వజ్ఞుడుగా సమాజం పట్ల తన బాధ్యత ఎరిగిన వాడు. రాజు నందికేశ్వరుడు, అరాజకస్థితిలో వున్న రాజగిరికి పాలకుడుగా ప్రతాపుణ్ణి నియమించాడని వినగానే, ఆ యువకుడు కడుసమర్థుడని సహజానందుడు గుర్తించాడు. అలాంటి వాళ్ళ స్థానం ఆశ్రమాల్లో కాదు; ప్రజల మధ్య. ఇక దుర్జయుడి సంగతి; నగరంలోని అరాజకస్థితి కంతకూ అతడే కారకుడు. తాను మహారాణి బంధువునన్న గర్వంతో వున్నవాడు. అలాంటివాణ్ణి కనీసం ఆరు నెలలపాటైనా తన ఆశ్రమంలో వుంచగలిగితే, యీ లోపల ప్రతాపుడికి అతడి సహచరుల్ని కఠినంగా శిక్షించే అవకాశం కలుగుతుంది. ఆ తరవాత దుర్జయుడు ఆశ్రమం వదిలినా, సహచరులు లేని ఒంటరి వాడవుతాడు. అప్పుడు అతణ్ణి అదుపులో పెట్టడం ప్రతాపుడి వంటి సమర్థుడైన పాలకుడికి ఏమంత కష్టం కాదు. సహజానందుడు యిలా ఆలోచించే ప్రతాపుడూ, దుర్జయుల పట్ల భిన్నంగా ప్రవర్తించాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# జ్ఞాని-అజ్ఞాని

శశాంకనగర సమీపంలోని కొండల్లో వీరేశుడు అనే గజదొంగ వుండేవాడు. వాడు తన అనుచరులతో కలిసి దారే పోయే ప్రయాణీకులను దోచుకోవడమే గాక, అప్పుడప్పుడూ నగరంలో కూడా దొంగతనాలు చేస్తూండేవాడు.

ఒకసారి వీరేశుడు నగరానికి ముగ్గురు అనుచరులను పంపాడు. వారం రోజుల తరవాత వాళ్ళల్లో ఒకడు తిరిగి వచ్చి, విచారంగా తల వంచుకుని నిలబడ్డాడు.

వీరేశుడు వాణ్ణి, "ఏం జరిగింది? తతిమ్మా యిద్దరూ రాజభటులకు దొరికి పోయారా?" అని అడిగాడు.

"అయ్యా, వాళ్ళు దొరికిపోయింది రాజ భటులకు కాదు; ధర్మచూడుడు అనే ఒక నీతిబోధకుడికి!" అన్నాడు దొంగ.

వీరేశుడు వాణ్ణి జరిగిందేమిటో వివరంగా చెప్పమన్నాడు. దొంగ యిలా చెప్పాడు:

"మేం ముగ్గురం పగలల్లా నగరంలోని ధనికుల ఇళ్ల ఆరాలు తీస్తూ, రాత్రికి సత్రంలో పడుకునే వాళ్ళం. నాలుగు రోజుల క్రితం సత్రానికి ఎదురుగా వున్న గుడి మండపంలో ధర్మచూడుడు అనే మహాజ్ఞాని వచ్చి దిగాడనీ, ఆయన శాస్త్రాల్లోనీ, పురాణాల్లోనీ ధర్మవిషయాలు చెపుతాడనీ తెలిసింది. ఏదో కాలక్షేపం జరుగుతుందని జనంతోపాటు మేం ముగ్గురం కూడా వెళ్ళాం. వరసగా రెండు రోజులపాటు రాత్రిళ్ళు ఆయన ధర్మ బోధలు వినగానే నాతోటి వాళ్లలో ఎక్కడ లేని మార్పు వచ్చింది. ఛీ, దొంగతనాలు చేసి పాపం ఒడిగట్టుకోవడం ఎందు కంటూ, వాళ్ళు ధర్మచూడుడి శిష్యుల్లో కలిసిపోయారు."

ఆమాటలు వింటూనే వీరేశుడు కోపంగా, "మరి, నీ సంగతేమిటి?" అన్నాడు.

యర్నాగుల సుధాకరరావు

"నాకూ, యీ పాపకర్మ నుంచి బయట పడాలనే వున్నది. అయినా, ముందు. సంగతి మీకు చెపుదామని వచ్చాను," అన్నాడు దొంగ.

"అలాగా!" అంటూ వీరేశుడు తల వూపి, "ఈ రాత్రికి నువ్విక్కడే వుండు. నేను నగరం పోయి, ఆ ధర్మచూడుడి సంగతేమిటో తేల్చి వస్తాను," అన్నాడు.

ఆ రాత్రి వీరేశుడు వెళ్ళేసరికి గుడి మంటపంలో ధర్మచూడుడు పురాణ శ్రవణం చేస్తున్నాడు. జనం ఆయన మాటలను మైమరచి వింటున్నారు.

వాడు దగ్గిరలో వున్న ఒక వృద్ధుణ్ణి పలకరించి, "ఈయన చెప్పే మాటలు విని, అందరూ యింతగా పరవశించి పోవడానికి కారణం ఏమిటి?" అని అడిగాడు. "ఆయన మహాజ్ఞాని!" అన్నాడు వృద్ధుడు.

"ఒక్క మాటలో మహాజ్ఞాని అంటే సరిపోయిందా? దీనివెనక ఏదో రహస్యం వుండి వుంటుంది," అన్నాడు వీరేశుడు.

వాడి అజ్ఞానం గ్రహించి వృద్ధుడు విసుగ్గా, "ఆయన చేతిలో వున్న తాటాకు గ్రంథమే, నువ్వనే రహస్యం!" అన్నాడు.

వీరేశుడికి ఆ తాటాకు గ్రంథం దొంగిలిస్తే, ధర్మచూడుడు 'అజ్ఞాని అయిపోతాడనీ, తన యిద్దరు అనుచరులతో పాటు జనం కూడా అతడి మాటలు వినరనీ అనుకున్నాడు.

వాడు ఆ రాత్రి తెల్లవారగట్ల, ధర్మచూడుడి ఇంటినుంచి తాళపత్ర గ్రంథాన్ని దొంగిలించి తన గుహకు వెళ్ళిపోయి, వారం రోజుల తరవాత ఒక రాత్రివేళ గుడిమంటపం దగ్గిరకు వచ్చాడు.

ధర్మచూడుడు చేతిలో ఏ గ్రంథం లేకుండానే ధర్మబోధ చేస్తున్నాడు. ప్రజలు తన్మయులై వింటున్నారు. దానితో తన అజ్ఞానానికీ, తను చేస్తున్న పాప కృత్యాలపట్లా వాడికి ఏవగింపు కలిగింది. వాడు జనం మధ్య నుంచి నడుచు కుంటూ పోయి, ధర్మచూడుడికి సాష్టాంగ పడ్డాడు.





# మేకు విలువ

పూర్వం ఒక గ్రామంలో ఒక పేదయువకు డుండేవాడు. అతని పేరు గోవిందుడు. అతనికి పెళ్ళి అయింది, ఇద్దరు పిల్లలు కూడా కలిగారు, కాని భూవసతి కొంచె మైనా లేకపోవటంచేత గోవిందుడు వారిని తన రెక్కల కష్టంమీద పోషించవలిసి వచ్చింది. ఇందుకుగాను అతను రహదారిన బస్తీకి నడిచి వెళ్ళి, ఏదైనా కూలీ నాలీ చేసి డబ్బులు సంపాదించి, ఆ డబ్బుతో ఇంటికి కావలిసిన వెచ్చాలు తెచ్చుకుంటూ వుండేవాడు.

వస్తుతః గోవిందుడు పొదుపు ఎరిగిన వాడు. అతని చిన్నతనంలో అతని తండ్రి, ''నాయనా, ప్రతి చిన్న వస్తువుతోనూ ఎప్పుడో ఒకప్పుడు అవసరమైన పని వుంటుంది,'' అని చెప్పేవాడు.

ఒకనాడు అతను రహదారిన బస్తీకి నడిచి పోతూండగా అటుగా మంత్రి కొడుకు గుర్రం ఎక్కి శరవేగంగా వచ్చాడు. గోవిందుడు చూస్తుండగానే గుర్రం కాలి లాడం తాలూకు మేకొకటి జారి, దారిలో పడిపోయింది.

''బాబూ, లాడంమేకు పడిపోయింది!'' అని గోవిందుడు ఎలుగెత్తి అరిచాడు.

మంత్రి కొడుకు వెనక్కు తిరిగి చూసి, నిర్లక్ష్యంగా చెయ్యి ఊపి ముందుకు వెళ్ళాడు. ఒక లాడం మేకు కోసం వెనక్కు వెళ్ళటం అతనికి పరువు లోపమనిపించింది. అదీగాక అతను అరణ్యంలోనుంచి వెళ్ళే అడ్డదారిన నగరానికి వెళుతున్నాడు. అందుచేత ఆ మేకు లేనందువల్ల పెద్ద ఇబ్బంది ఏమీ ఉండదనుకున్నాడు.

కాని ఈ విషయంలో మంత్రి కొడుకు చాలా పొరపడ్డాడు. అతను అరణ్యంలో ఆటే దూరం పోక మునుపే గుర్రం కాలి



లాడం వదులై ఊడి వచ్చింది గోవిందుడి దగ్గిర మేకు తీసుకుని ఉండినట్టయితే మంత్రి కొడుకు ఏదో ఒక విధంగా లాడాన్ని మళ్ళీ బిగించి ఉండేవాడే. కాని లాడం లేక గుర్రం కుంటుతూ ఉండటం చేత అతను గుర్రం దిగి నడవవలసి వచ్చింది. అతను అరణ్యంగుండా నడిచి పోతూ ఉండటం చూసి దొంగలు అతని మీద పడి, నిలువుదోపిడి చేసి, అతన్ని ఒక చెట్టుకు అంటగట్టి పారిపోయారు.

ఈ లోపల గోవిందుడు లాడంమేకు తీసి తనవద్ద ఉంచుకుని ముందుకు సాగాడు. అతను కొంత దూరం వెళ్ళే సరికల్లా ఒక బండి దారిలో ఒరగబడి ఉండటం కనిపించింది. శాయి మేకు పోవటంచేత చక్రం ఒకటి ఊడి వచ్చేసింది. బండి పక్కన ఒక ధనికుడు నిలబడి ఉన్నాడు.

ఆయన గోవిందుణ్ణి చూడగానే, "అబ్బీ, నీ దగ్గిర ఏదైనా మేకున్నదా? నేను త్వరగా నగరం చేరాలి. మధ్యే దారిలో ఎక్కడో శాయి మేకు పడిపోయింది. ఈ దిక్కుమాలిన ప్రదేశంలో ఇంత ఇనపముక్క కూడా ఉన్నట్టు కనబడదు," అన్నాడు.

గోవిందుడు తన వద్ద ఉన్న లాడం మేకు తీసి దాన్ని చక్రం ఇరుసులోకి రాతితో దిగవేశాడు. ధనికుడికి ప్రాణం లేచివచ్చినట్టయింది.

"నువు కూడా నగరానికే పోతున్నావేమో, బండిలో రా!" అంటూ ధనికుడు గోవిందుణ్ణి తనతో నగరానికి తీసుకుపోయి అతని చేతిలో ఒక బంగారు కాసు పెట్టాడు.

ఆ కాసు చూడగానే గోవిందుడి కళ్ళు పెద్దవి అయాయి. అది తన కుటుంబానికి రెండు మాసాలు సరిపోతుంది. తన తండ్రి ఏనాడో అన్న మాట ఇప్పుడు అక్షరాలా నిజమైంది; ఒక చిన్న లాడం మేకు బంగారు కాసు తెచ్చిపెట్టింది!

గోవిందుడు నగరంలో తన కుటుంబానికి నెల రోజులు సరిపడే సరుకులు

కొని ఒక గోతంలో వేసుకుని, దగ్గిర దారి గదా అని అరణ్యం గుండా ఇంటికి రాసాగాడు. అతను కొంత దూరం వచ్చేసరి కల్లా దారికి ఒక పక్కనున్న చెట్ల వెనక నుంచి ఏవో ఆర్తనాదాలు వినిపించాయి.

గోవిందుడు తన గోతాన్ని గుర్తుగా ఒక చోట పొదల మధ్య దాచి చెట్లలో ప్రవే శించాడు. అతను చాలా సేపు నడిచాక ఒకచోట ఆరుగురు పిల్లలూ ఒక స్త్రీ కని పించారు. అందరూ చాలా దీనస్థితిలో ఉన్నారు.

ఆ స్త్రీ ఒక కోటీశ్వరుడి భార్య; పిల్ల లందరూ ఆమె సంతతి.



"మొన్న సాయంకాలం మేమంతా కలిసి అరణ్యంలో విహారానికి వచ్చాం, మా పిల్లలు పూలకోసం అడవిలో జొర బడ్డారు. వాళ్ళెక్కడ తప్పిపోతారో అని నేను కూడా వాళ్ళ వెంటే వెళ్ళాను. ఇంతలో పొద్దుగూకింది. మాకు దారి తెలియలేదు. ఆ రాత్రంతా తిండి లేకుండా దారి వెతుకుతూ తిరిగాం, నిన్న నల్లా మాకు దారి దొరకలేదు. అన్నమూ, నీళ్లూ లేకపోవటంచేత మాకు తిరిగే శక్తి కూడా పోయింది. ఇక్కడి నుంచే కేకలుపెట్టాం. మా మొర ఆల కించినవాళ్ళు లేరు. ఇవాళ నువు దేవుడల్లే వచ్చావు!" అన్నది కోటీశ్వరుడి భార్య.

"మీకు వచ్చిన భయమేమీ లేదు. నేను మీకు దారి చూపిస్తాను, నా వెంట రండి," అన్నాడు గోవిందుడు.

"నాయనా, మేం అడుగు తీసి అడుగు పెట్టే స్థితిలో లేం. మా కిప్పుడు కావల సింది, పట్టెడన్నం!" అన్నదా స్త్రీ.

"అయితే ఉండండి, ఇప్పుడే వస్తాను" అంటూ గోవిందుడు పరిగెత్తి వెళ్ళి తన సంచీ తెచ్చాడు. అందులో తన పిల్లలకోసం తెచ్చిన తినుబండారాలూ, మిఠాయీ ఉన్నాయి. వాటిని అతను కోటీశ్వరుడి పిల్లలకిచ్చి, తన దగ్గిర ఉన్న పదార్థాలతో ఆ అడవిలోనే వంట చేశాడు. కొద్ది సేపటిలో అందరూ అన్నాలు

తిన్నారు. పోయిన ప్రాణాలు లేచివచ్చి నట్టయింది వారికి. వారిని వెంటబెట్టుకుని గోవిందుడు దారి దాకా తెచ్చి, "ఇక నాకు సెలవిప్పించండి!" అన్నాడు.

"అమ్మయ్యో, మేం ఇల్లు చేరలేం! మమ్మల్ని ఇల్లు చేర్చి మరీ వెళ్ళు!" అన్నది కోటీశ్వరుడి భార్య. ఆమె తన పిల్లలతో సహా ఇల్లు చేరి గోవిందుణ్ణి పంపేస్తూ, అతని చేతిలో ఒక చిన్న సంచీ పెట్టింది.

గోవిందుడు దాన్ని విప్పి చూసుకుంటే అందులో ఎనిమిది బంగారు కాసులున్నాయి. వాటిని చూసి అతని కళ్ళు మరీ పెద్దవయాయి. ఒక్క లాడంమేకు ఇంత డబ్బు తెస్తుందని అతను కలలో కూడా అనుకోలేదు. అతను మరికొన్ని సరుకులు కొనుక్కొని అడవి దారిన బయలుదేరాడు.

అడవి మధ్యకు చేరుకునేసరికి అతనికి సమీపంలో మనిషి మూలుగు వినిపించింది. అతను ఆ మూలుగు వినిపించిన దిక్కుగా వెళ్ళి, చెట్టుకు కట్టేసి శోష పడివున్న మంత్రికొడుకును చూశాడు.

మంత్రికొడుకు హీనస్వరంతో తనకు జరిగిన ప్రమాదం గురించి గోవిందుడికి చెప్పాడు. గోవిందుడు అతని కట్లు విప్పి నడిపించుకుంటూ తన ఇంటికి తీసుకుపోయి కడుపునిండా తిండి పెట్టించాడు.

"బాబూ, తమరు లాడంమేకు లేని కారణంచేత ఎంత నష్టపోయారో, నేను దానితో అంత లాభం పొందాను," అంటూ గోవిందుడు తన కథ యావత్తూ చెప్పాడు.

అంతా విని మంత్రి కొడుకు, "చూడు, గోవిందూ! సరిగా నీవంటి వాడొకడు నన్ను కనిపెట్టి వుండటానికి నౌకరుగా కావాలి. నా వెంట నగరానికి వచ్చెయ్యి. నీకు మంచి ఇల్లూ, జీతమూ ఇస్తాను!" అన్నాడు.

ఆ రోజే గోవిందుడు తన కుటుంబాన్ని తీసుకుని నగరానికి వెళ్ళి, మంత్రి కుమారుడి వద్ద కొలువులో ప్రవేశించాడు.





# ఆశాపాతకుడు

కాశీరాజ్యాన్ని పాలించే బ్రహ్మదత్తుడికి ఇద్దరు కొడుకులు. తనకు అవసానకాలం సమీపించగానే, రాజు పెద్దవాడికి రాజ్యమిచ్చి, చిన్నవాడిని సేనాధిపతిగా చేశాడు. తండ్రి తదనంతరం జ్యేష్ఠుడి పట్టాభిషేకానికి ఏర్పాట్లు జరిగినై. తీరా గద్దెయెక్కే సమయాన అతడు, "నాకీరాజ్యంతో పని లేదు. తమ్ముణ్ణి ఏలుకోనీ," అంటూ వైరాగ్యంలో పడ్డాడు.

అతడు కాశీరాజ్యం విడిచిపోయి, ఎక్కడో దూరాన వుండే ఒక సామంత రాజ్యం చేరుకున్నాడు. అక్కడ ఒక ధనికుని ఇంట కొలువుకు కుదురుకొని, కాయకష్టంతో కాలక్షేపం చేయసాగాడు.

కొంత కాలానికి కాశీరాజ్యం నుండి కొందరు ఉద్యోగులు భూములు తనిఖీ చేసి పన్నులు విధించే పనిమీద ఆ రాజ్యానికి వచ్చారు. వారు ధనవంతుని యింట వున్న రాజకుమారుని ఆనవాలు పట్టి అతని పట్ల భక్తి చూపారు. ఈ సంగతి తెలియగానే, ఆ ధనవంతుడు రాజకుమారుని వద్దకు వచ్చి, "కాశీరాజయిన మీ తమ్ముడికి జాబువ్రాసి, నాకు పన్నులు తగ్గేట్టు చూడవలసింది," అని కోరాడు. రాజకుమారుడు అలానే రాశాడు. కాశీరాజు ఒప్పుకున్నాడు.

ఇది వెల్లడికాగానే, గ్రామస్థులు అనేక మంది వచ్చి, తమకు కూడా భూమి పన్నులు తగ్గించమని రాజుగారికి వ్రాయమంటూ వేధించారు.

అందరి తరఫునా రాజకుమారుడు విజ్ఞాపనలు రాసి కాశీ రాజుకు పంపాడు. అందరికీ కోరిన ప్రకారం భూమి పన్నులు తగ్గినై.

నాటినుంచీ ప్రజలు వారీయవలసిన పన్నులు పట్టుకవచ్చి రాజకుమారునికే

జాతకకథ



చెల్లించి, పుచ్చుకోమని నిర్బంధింప జొచ్చారు. అతనికి లోకులు బ్రహ్మరథం పట్టారు. రాజకుమారునికి వైరాగ్యభావం పోయి, మళ్ళీ రాజ్యకాంక్ష అంకురించింది. ఐతే, వద్దన్న రాజ్యం ఇప్పుడెలా వస్తుంది?

కనుక, క్రమంగా ఒక్కొక్క సామంత రాజ్యమే వశం చేసుకుంటూ, ఈ మాట తమ్ముడికి తెలుపుతూ వచ్చాడు. కాశీ రాజయిన అతని తమ్ముడు అన్న మాటలలో దేనికీ కాదనలేదు. తరవాత కాశీ రాజ్యమే ఆక్రమిద్దామని అన్నకు ఆశ పుట్టింది. నలుగురు పెద్దల్ని నియమించి, ''రాజ్యంవశపరుస్తావా, యుద్ధం చేస్తావా?'' అంటూ తమ్ముడికి రాయబారం పంపించాడు. ''నాకు నీతో యుద్ధం వద్దు. అసలీ రాజ్యం నీదే. కనుక నీవే తీసుకోవడం న్యాయం'' అనికబురు పంపాడు తమ్ముడు.

ఆ వెంటనే అన్న సింహాసనం అధిష్ఠించాడు. తమ్ముడు సేనాధిపతి పదవి అలంకరించాడు.

పెద్దవాడు రాజ్యం ఆక్రమించాడే కాని, ఈ ఒక్క రాజ్యంతో అతనికి తృప్తిలేకపోయింది. రాజ్యతృష్ణ మిక్కుటమైన కొద్దీ ఇంకొకటి, మరొకటి ఇలా ఎన్నో రాజ్యాలు జయించి తన రాజ్యానికి చేర్చుకోసాగాడు. ఎన్ని రాజ్యాలు చేర్చుకున్నా అతనికి సంతుష్టి కలగలేదు.

దేవేంద్రుడు భూలోక వ్యవహారాలన్నీ చర్చ చేస్తూ వుండగా, కాశీరాజ్యం సంగతి వచ్చింది. ఈ విషయంలో ఉపేక్షిస్తే భూలోకానికిహాని కలిగేట్టు తోచింది. అందు చేత పెద్దవానికి గట్టిగా బుద్ధి చెప్పాలనుకున్నాడు దేవేంద్రుడు.

ఈ సంకల్పంతో దేవేంద్రుడు ఒక యువకుని రూపంలో రాజదర్శనానికి వచ్చాడు. ఒక చిన్న రహస్యం చెప్పిపోదామని వచ్చానన్నాడు.

వెంటనే రాజు ఆ యువకుణ్ణి అమితోత్సాహంతో తన అంతఃపురంలోకి తీసుకుపోయాడు.

''రాజా! నా ఎరుకలో ఒకచోట మూడు మహానగరాలున్నవి. అవి సమస్త సిరిసంపదలతోనూ, గజ తురగ పదాతి బలాలతోనూ తులతూగుతున్నవి. వాటిని నా శక్తివల్ల నేనే జయించి నీ కిస్తాను,'' అంటూ ప్రోత్సహించాడు యువకుడి వేషంలో వున్న దేవేంద్రుడు.

ఆశతో పరవశుడయ్యాడు రాజు. దేవేంద్రుడు అంతలో అదృశ్యమైపోయాడు.

రాజు యువకుని కోసం వెతికాడు. కనిపెంచక పోయేసరికి కలవర పడ్డాడు. వెంటనే ముఖ్యోద్యోగుల్ని పిలిపించి, ''ఇప్పుడు వచ్చినతడు నాకు మూడు మహానగరాలను జయించి ఇస్తానన్నాడు. వెతికి పట్టండి,'' అని వేగిరపెట్టాడు.

పరిచారకులు పోయి నగర మంతా గాలించారు. యువకుని జాడ లేదు. రాజుకు మతిపోయినట్టయింది.

ఈ విచారం ముదిరి, మనోవ్యాధిగా పరిణమించి, రాజు మంచం పట్టాడు. ఎంతటి ఘనవైద్యులు వచ్చినా వ్యాధి కుదరలేదు.

ఇదే సమయాన, సమస్త శాస్త్రాల లోనూ ప్రవీణుడై బోధిసత్వుడు తక్షశిల నుండి ఇంటికి వచ్చాడు. రాజు సంగతి తెలిసి, కోటకు వెళ్ళి, ''వ్యాధి నేను కుదురుస్తాను,'' అని, కబురు చేశాడు.

లోపలికి రమ్మన్నాడు రాజు. ''మీ బాధ యేమిటి?'' అని అడిగాడు బోధిసత్వుడు. అప్పుడు రాజు ఆవేశంతో తనకు



అనాడు యువకుడు మూడు మహానగ రాలు వాగ్దానం చేయడం దగ్గిర నుంచీ జరిగిందంతా వివరంగా చెప్పాడు. "అప్పటి నుంచీ నాకీ జబ్బు పట్టుకొని పీడిస్తున్నది. కుదర్చగలవేమో చూడు," అన్నాడు.

"రాజా! ఈ విధంగా మనోవేదన పడుతూ వుంటే ఆ మహానగరాలను జయించటం సాధ్య మవుతుందా?" అని ప్రశ్నించాడు బోధిసత్వుడు.

"సాధ్యంకాదు," అన్నాడు రాజు.

"అందుచేత విచారపడి ఏమీ లాభం లేదు. ఈ ప్రపంచంలో ప్రతి వస్తువూ కొంత కాలానికల్లా నశించిపోతున్నదే కద!" అని అడిగాడు బోధిసత్వుడు. రాజు, "అవును," అన్నాడు.

"ప్రతిజీవుడూ ప్రాణం పోవటంతో, దేహాన్ని సైతం ఇక్కడ వదిలి పోవల సిందేకద!" అని మళ్ళీ అడిగాడు బోధిసత్వుడు. ఒప్పుకొన్నాడు రాజు.

"కనుక, రాజా! - మూడు కాదు, ముప్పయి మహానగరాలు సంపాదించి నప్పటికీ, నివు ఎక్కువ సుఖపడేది లదు. ఏదీ శాశ్వతం కాదు. ఆశ అనేది ఒక పెనుభూతం. దానికి అంతులేదు. ఆశకు మానవుడు లొంగినప్పుడు, ఇప్పుడు నీకు పట్టుకున్న లాగే, మనోవ్యాధి పట్టుకు పీడిస్తుంది. దీని పీడ తప్పించుకోవాలంటే మనసులో కలిగే కోరికలను ఒక హద్దులో ఉంచాలి, దాటనీయరాదు. చెప్పుకి సరిగా సరిపడేట్టు చర్మకారుడు ఎలా చర్మం కోస్తాడో, అలా జీవితంలో మనకు ఉపయోగపడేటంత వరకే కోరికల్ని అతిశయించ నీయాలి. హద్దు దాట నిచ్చామో, ఆజ్యం పోసిన అగ్నిజ్వాలలాగా కోరికలు విజృంభించి, ప్రమాదకర మవుతై," అని చెప్పేసరికి, రాజుకు మనశ్శాంతి కలిగి, క్రమంగా వ్యాధి నయమయింది.

రాజు కోరికపైన బోధిసత్వుడు మరెన్నో ధర్మబోధలు చేసి, జీవితాంతం వరకూ దేశికుడుగా రాజ్యపాలనలో అవసరమైన సలహాలు యిస్తూండేవాడు.





# భక్త కబీర్

వారణాశికి సమీపంలోని ఒక గ్రామంలో నిరూ, నీమా అనే ముస్లిం దంపతులు వుండేవారు. ఒకనాడు ఉదయం ఒక చెట్టు కింద యేడాది నిండీనిండని పాప నిరూ కంటపడింది. అతడు ఆ బిడ్డను తెచ్చి భార్యకు యిచ్చాడు. సంతానం లేని ఆ ఆలూమగలు బిడ్డను చూసి పరమానందం చెందారు.

వారా బిడ్డకు కబీర్ అని పెరు పెట్టి అల్లారు ముద్దుగా పెంచారు. కబీర్ పెరిగి పెద్దవాడై పెంపుడు తండ్రి నేత వృత్తిని నేర్చుకోసాగాడు. మగ్గం మీద కూర్చుని బట్టలు నేస్తూ, ఆ లయకు తగ్గ విధంగా మనసులో పాటలు పాడు కుంటూ వుండేవాడు.





ఆ సమయంలోనే వారణాశిలో సుప్రసిద్ధుడైన రామానందస్వామి వుండేవాడు. కబీర్ ఆయన చేత ఆకర్షింపబడ్డాడు. కాని తల్లిదండ్రు లెవరో తెలియని నిరక్షరాస్యుడైన తనను రామానందస్వామి శిష్యునిగా అంగీకరించడేమో అన్న అనుమానం కబీరును పీడించసాగింది.




ప్రతి రోజూ వేకువజామున గంగా స్నానం చేసి రావడం రామానంద స్వామికి అలవాటు. అలా ఆయన వెళ్ళినప్పుడు ఒక రోజు కబీర్ గంగా నదికి వెళ్ళే మెట్ల మీద సాష్టాంగంగా పడుకున్నాడు. స్నానం చేసి వస్తున్న రామానందస్వామి పాదం కబీర్ శరీరానికి తగలడంతో, ఆయన రామ్ రామ్ అని దైవనామస్మరణ చేశాడు.

వెంటనే లేచి నిలబడిన కబీర్ చేతులు జోడించి, "స్వామీ! ఈ ప్రభాత శుభ సమయంలో పవిత్ర గంగాస్నానం చేసి వస్తూ, మీరు నాకు దివ్య నామాన్ని ఉపదేశించారు," అన్నాడు. "ఎవరు నువ్వు?" అని అడిగాడు రామానంద స్వామి. "నా పేరు కబీర్. మీ శిష్యుణ్ణి. అదొక్కటే నేను చెప్పుకోదగ్గది," అన్నాడు కబీర్ వినయంగా.





అనతికాలంలోనే కబీర్ భక్తిగీతాలతో బాటు, దేవుని దయ పొందడానికి కావలసినవి వెలుపలి ఆచారాలు కావు, నిర్మలమైన భక్తి ప్రపత్తులే అన్న ఆయన బోధనలు కూడా ప్రజలలో విశేష ప్రచారం పొందాయి. కబీర్ జాతి భేదాలను నిరసించాడు. హిందూ, ముస్లిమ్ సమాజాలలోని ఛాందస భావాలను పరిహసించాడు.

కబీర్‌ను అవమానపరచాలని కొందరు, ఆయన విందుకు ఆహ్వానించాడని పందలాదిమందికి కబురు చేశారు. ఆ విషయం తెలియకపోవడం వల్ల ఆ సమయంలో కబీర్ ఇంట్లో లేడు. కాని ఆయన ఇంటికి తిరిగి వచ్చాక, వచ్చినవారందరికీ, ఎవరో తనలాంటి వ్యక్తే, తృప్తిగా భోజనాలు పెట్టి పంపి నట్టు గ్రహించి ఆశ్చర్యం చెందాడు.





సంప్రదాయవాదులు కొందరు తమ మత విశ్వాసాలను కబీర్ అవమాన పరుస్తున్నట్టు ఢిల్లీ సుల్తాన్‌కు ఫిర్యాదు చేశారు. సుల్తాన్ విచారణ జరపగా కబీర్, "నేను హిందువునూ కాను, ముస్లింనూ కాను. హిందూ ముస్లిం భేదం చూడని దేవుని భక్తుణ్ణి," అన్నాడు.

ఆయన నిర్భయమైన సమాధానం తేగల ప్రమాదాన్ని వివరించి, ఒక ఉద్యోగి కబీర్‌ను భయపెట్టడానికి చూశాడు. కాని ఆయన మాత్రం, "ఏనుగు మీద వెళు తున్న కబీర్ కుక్క మొరుగుకు భయ పడతాడా?" అని జవాబిచ్చాడు. సభకు అందరూ భయాశ్చర్యాలు చెందారు. సుల్తాన్ కబీర్ ధైర్యాన్ని మెచ్చుకుని గౌరవంగా సాగనంపాడు.





గోరఖ్‌పూర్ అనే గ్రామంలో కబీర్ కాలధర్మం చెందాడు. ఆయన భౌతిక కాయాన్ని దహనం చెయ్యాలని హిందూ శిష్యులూ, భూస్థాపితం చెయ్యాలని ముస్లిమ్ అనుచరులూ వివాదంలోకి దిగారట.

కాని కబీర్ భౌతికకాయానికి కప్పిన తెల్ల బట్టను తొలగించగానే ఆయన కాయానికి బదులు తామరపుష్పాలు కనిపించాయట! వాటిలో కొన్ని పుష్పాలను హిందూ శిష్యులు కాశీకి తీసుకుపోయి, వాటిమీద స్మారకమందిరం నిర్మించారు. మిగిలిన పువ్వులను, ముస్లిం అనుచరులు భూస్థాపితం చేసి దాని మీద గోరీ నిర్మించారు.





పదునాల్గవ శతాబ్దాంతం నుంచి, పదిహేనవ శతాబ్దారంభం వరకు జీవించిన కబీర్ గీతాలూ, ఆలోచనావిధానం ఆ తరవాతి తరాలను బాగా ప్రభావితం చేశాయి. ముఖ్యంగా గురునానక్, మీరాబాయి, రాయ్‌దాస్ మొదలైనవారిని కబీర్ బోధనలు విశేషంగా ఆకర్షించాయి.



# సమదృష్టి

మంగళాపురం జమీందారు తమ్ముడు తిరుపతిరాయుడికి, ఎదుటివారిలో ఏవేవో లోపాలంటూ ఎత్తి చూపడం సరదా. చిన్నా, పెద్ద భేదం లేకుండా ప్రతి ఒక్కరినీ అవహేళన పాలు చేయాలన్న మనస్తత్వం కలవాడు.

మంగళాపురంలో ఏటా జరిగే చైత్ర పౌర్ణమి ఉత్సవాలకు పరమానందస్వామి అనే సాధువు రావడం ఆనవాయితీ. ఆ ఏడు పరమానందస్వామి వస్తున్నట్టు తెలియగానే, మంగళాపురం ప్రజలు జోడెడ్లను పూన్చిన రథాన్నొకదాన్ని చక్కగా అలంకరించి తీసుకుపోయి, ఆయనకు స్వాగతం చెప్పారు.

పరమానందస్వామి మందహాసంచేస్తూ రథం ఎక్కి కూర్చున్నాడు. జనంలో వుండి యిదంతా చూస్తున్న తిరుపతి రాయుడు ముందుకు వచ్చి, "సర్వసంగ పరిత్యాగులైన స్వాములవారికి ఊరేగేందుకు రథం కావలసివచ్చిందా?" అన్నాడు హేళనగా.

ఇది విని జనం కోపగించుకున్నారు. కాని, పరమానందస్వామి ఎంతో శాంతంగా, "నువ్వన్నదాంట్లో కొంత నిజం లేకపోలేదు. నీతో వివరంగా తరవాత మాట్లాడతాను; ముందు వచ్చి రథంలో నా పక్కనకూర్చో," అన్నాడు.

తానేదో గొప్ప విజయం సాధించినట్టు పొంగిపోతూ, తిరుపతిరాయుడు రథం ఎక్కి కూర్చున్నాడు. కొద్దిసేపు తరవాత రథం ఒక పెద్ద భవనం ముందు ఆగింది.

తిరుపతిరాయుడు రథంలోంచి దిగుతూ, "ఇది మరీబావుంది! జగమే మాయ అని బోధించే స్వాములవారు బస చేయడానికి యింత గొప్ప భవనం కావాలన్నమాట?" అన్నాడు.

గౌరీశంకర్



పరమానందుడు చిరునవ్వు నవ్వి, ''ఒక్క వారం రోజులపాటు నువ్వు నా వెంట వున్నట్టయితే, నీ సందేహాలన్నీ తీర్చగలను,'' అన్నాడు.

ఇందుకు తిరుపతిరాయుడు అంగీకరించాడు. పరమానందస్వామి భవనంలో ప్రవేశించగానే, ఒక పట్టుబట్టల వ్యాపారి వెండిపళ్ళెంలో ఫలపుష్పాలతో పాటు ఒక పట్టువస్త్రం తెచ్చి, ఆయన పాదాలముందు పెట్టి, ''స్వామీ, వీటిని తమరు స్వీకరించాలి,'' అన్నాడు.

పరమానందుడు వ్యాపారితో, ''చాలా సంతోషం. నీ ఇష్టప్రకారమే తీసుకుంటున్నాను. ఇలాంటిదే మరొక వస్త్రాన్ని తీసుకువచ్చి తిరుపతిరాయుడికి కూడా యివ్వు,'' అన్నాడు.

తరవాత ఆయన అక్కడ చేరిన గ్రామపెద్దలతో, ''నేనిక్కడ వున్నంతకాలం తిరుపతిరాయుడు కూడా నాతోనే వుంటాడు. నాకు చేసే మర్యాదలన్నీ అతడికొక్కడా చేయాలి,'' అన్నాడు.

ఆ క్షణం నుంచీ పరమానందుడితో పాటు, తిరుపతిరాయుడు కూడా సకల సౌకర్యాలు అనుభవించాడు.

మూడోరోజు రాత్రి పరమానందుడు, తిరుపతిరాయుడితో, ''ఏ ఊళ్ళోనూ నేను మూడురోజులకన్న ఎక్కువ వుండను. రేపు తెల్లవారుతూనే మరొక ఊరుపోతున్నాను. నా వెంట వస్తావుగదా?'' అన్నాడు.

తిరుపతిరాయుడు అలాగే వస్తానన్నాడు. మర్నాటి ఉదయం మంగళాపురం ప్రజలు పరమానందస్వామిని రథం మీద కూర్చోబెట్టి, ఊరేగించుతూ తీసుకుపోయి, గ్రామపొలిమేర దగ్గిర దించి, భక్తిపూర్వకంగా వీడ్కోలు చెప్పారు.

రథం వెళ్ళిపోగానే దిక్కులు చూస్తూ నిలబడిన తిరుపతిరాయుడితో పరమానందుడు, ''ఇక మనం ఆ కనబడుతున్న కాలిబాట వెంట నడిచామంటే, సూర్యాస్తమయం వేళకు మరొక గ్రామం చేరగలం,'' అన్నాడు.

ఇద్దరూ కాలిబాట వెంట నడవసాగారు. ఆ బాట పోనుపోను రాళ్ళూ రప్పలతో నడవడానికి కష్టసాధ్యంగా తయారైంది. తిరుపతిరాయుడు బాగా అలిసిపోయాడు. ఒక పక్క అతణ్ణి ఆకలి వేధిస్తున్నది; మరోపక్క మండే ఎండ. పరమానందుడు మాత్రం చకచకా నడిచిపోతున్నాడు.

తిరుపతిరాయుడు యిక నడవలేక, పరమానందుడితో, "అయ్యా, నోరెండి పోతున్నది, దాహం!" అన్నాడు బాధగా.

పరమానందుడు దారిపక్కనే వున్న చిన్న నీటిమడుగును అతడికి చూపుతూ, "వెళ్ళి దాహం తీర్చుకో!" అన్నాడు.

"ఆ నీళ్ళా! అవేం తేటగాలేవు. నిన్నటి వరకు దాహం అంటే పళ్ళరసం యిప్పించావుగదా, అప్పుడే మరిచావా?" అన్నాడు తిరుపతిరాయుడు ఆయాసపడిపోతూ.

"అదేంలేదు. కాని, యిక్కడ మనకు పళ్ళరసం యిచ్చేవాళ్ళు ఎవరూ లేరు గదా!" అంటూ పరమానందుడు నీటి మడుగులోదిగి నాలుగు దోసిళ్ళ నీళ్ళు తాగాడు. తిరుపతిరాయుడు కూడా దాహం తీర్చుకుని, మడుగు ఒడ్డుమీద కూర్చుని, "అయ్యా, యిక నాకు నడిచే ఓపిక లేదు," అన్నాడు.

పరమానందుడు నవ్వుతూ అతడి పక్కన కూర్చున్నాడు. ఒక గంట గడి



చేంతలో ఒక ఒంటెద్దుబండి వాళ్ళకేసి వచ్చింది. బండితోలే శరభయ్య అనేవాడు పరమానందుణ్ణి చూస్తునే బండి దిగి, "స్వామీ, బండి ఎక్కండి, పోదాం!" అన్నాడు నమస్కరిస్తూ.

ఇద్దరూ బండి ఎక్కారు. వాళ్ళు శరభయ్య వాళ్ళ గ్రామం చేరేసరికి బాగా రాత్రయింది.

శరభయ్య బండిని ఒక చావడి ముందు ఆపి, "స్వామీ, నేనుండేది చాలా చిన్న గుడిసె. యీ చావడి మీకు సౌకర్యంగా వుంటుంది," అన్నాడు.

పరమానందుడూ, తిరుపతిరాయుడూ చావట్లోకి వెళ్ళారు.

''ఈ రాత్రి మనం యిక్కడే నిద్రించాలి,'' అన్నాడు పరమానందుడు.

తిరుపతిరాయుడు దీనంగా ముఖం పెట్టి, ''నిద్రమాట దేవుడెరుగు. ముందు అకలి చల్లారడంఎలా?'' అన్నాడు.

అంతలో శరభయ్య రెండు చిన్న ముంతల్లో గంజి తీసుకువచ్చి, ''ఈ అపరాత్రివేళ యింతకన్న ఇంట్లో మరేం లేదు, నన్ను మన్నించాలి,'' అన్నాడు.

పరమానందుడు ముంతలో గంజితాగి, ముంతను శరభయ్యకు యిచ్చాడు. తిరుపతిరాయుడు కూడా గంజితాగి వాంతి చేసుకోబోతున్నవాడిలా, ''ఇందులో తగినంత ఉప్పు కూడా లేదు!'' అన్నాడు.

పరమానందుడు వెళ్ళబోతున్న శరభయ్యను వెనక్కు పిలిచి, ''ఈ అర్ధరాత్రి వేళ యింత గంజిపోసి, మా ప్రాణాలు నిలిపావు. నీమేలు మరవరానిది! ఇదుగో, ఈ పట్టువస్త్రం తప్ప నా దగ్గిర మరేంలేదు; దీన్ని తీసుకో,'' అంటూ వస్త్రాన్ని శరభయ్య కిచ్చాడు.

తిరుపతిరాయుడు ఆశ్చర్యపోతూ, ''ఉప్పు కూడా లేని యిన్ని గంజినీళ్ళకు పట్టువస్త్రం బహూకరణా! అంత విలువ తెలియనివాడివి, అసలు దాన్ని ముందు ఎందుకు తీసుకున్నట్టు?'' అని అడిగాడు.

పరమానందుడు నవ్వుతూ, ''మంగళాపురం ప్రజలు ప్రీతితో యిచ్చారు గనక తీసుకున్నాను. అయినా, యింత కావిబట్ట కట్టుకు తిరిగే నా కెందుకు పట్టువస్త్రాలు? నువ్వే చెప్పు తిరుపతిరాయుడూ! మనుషులు దేన్నయినా సమదృష్టితో చూడడం నేర్చుకోవాలి. అభిమానులు ప్రేమకొద్దీ పెట్టే విందుభోజనమైనా, గంజి అయినా, నా కొక్కటే. సుఖాలకు పొంగిపోకుండా, కష్టాలకు కుంగిపోకుండా నా చేతనైనంతలో సాటిమనిషికి సాయపడేందుకు ప్రయత్నిస్తున్నాను,'' అన్నాడు.

తిరుపతిరాయుడు ఆయన పాదాలు తాకి, ''మీ మంచితనం తెలుసుకోలేక నా అజ్ఞానం కొద్దీ దురుసుగా ప్రవర్తించాను, క్షమించండి!'' అన్నాడు.



# అంతా వీరులే!

కుంతలదేశం వాడైన అజయు డనే యువకుడికి, కర్పూరదేశ రాజధాని అయిన ఇందు పురంలో వినయు డనే మిత్రుడున్నాడు. ఒకసారి అజయుడు తన సొంత గుర్రాన్నెక్కి మిత్రుణ్ణి చూసేందుకు ఇందుపురం వెళ్ళాడు.

వినయుడు తన మిత్రుణ్ణి నకల మర్యాదలతో ఆదరించి, సాయంత్రం కాగానే రాజ ధాని వింతలు చూసేందుకు, తన గుర్రం మీద అజయుడి వెంట బయలుదేరాడు. కొంత దూరం పోయాక వినయుడి గుర్రం వెనకబడింది. ముందు పోతున్న అజయుడు తల తిప్పి, "మా కుంతలదేశం గుర్రాలు మేలు జాతివి. చూశావు గదా, ఎంత వేగంగా పరిగెత్తుతున్నదో!" అన్నాడు గర్వంగా.

వినయుడు చిన్నగా నవ్వి, "మాకు మేలుజాతి గుర్రాలతో పనిలేదు. యుద్ధరంగంలో శత్రువును ఎదిరించి పోరాడేటప్పుడు, గుర్రాల వేగంతో పనిలేదు కదా? వెన్నిచ్చి పారి పోయే శత్రువును, మే మేనాడూ వెంటబడి తరమం. మా దేశంలో అంతా వీరులే!" అన్నాడు.

మిత్రుడి జవాబుకు అజయుడు ఎంతగానో సంతసించాడు. —రాంబాబు





# నిజాయితీపరులు

గోపవరం అనే గ్రామంలో నీలకంఠం రెండెకరాల మెట్ట పొలంగల చిన్న రైతు. ఆయనకు ఒకే ఒక సంతానం అవంతి. చిన్నప్పుడే తల్లిని పోగొట్టుకున్న ఆమెను, నీలకంఠం ఏ లోటూ కనబడకుండా పెంచాడు. ఆమె కిప్పుడు పెళ్ళీడు వచ్చింది. పదీ పదిహేను వేలైనా కట్నంగా ముట్టజెపితే తప్ప వరులు దొరికేలాలేరు. నీలకంఠం ఎక్కడైనా అప్పు దొరుకుతుందేమో అని పొరుగూరులోవున్న బంధువుల ఇంటికి వెళ్ళాడు. అవంతి పక్క గ్రామంలో వున్న స్నేహితురాలింటికి వెళ్ళింది.

ఆ రోజు చీకటి పడేవేళ ఆమె బాడుగ బండిలో తిరిగివచ్చి, ఇంటి ముందు దిగింది. లోపలినుంచి తండ్రి ఎవరితోనో ఘర్షణ పడుతున్నట్టు, పెద్దగా కేకలు వినిపించాయి.

"వయసులో పెద్దవాడివని ఇంత వరకూ మర్యాద యిచ్చాను. బుద్ధి మార్చుకుని ఉదయానే నా డబ్బు యివ్వక పోయావో, గ్రామాధికారికి ఫిర్యాదు చేస్తాను," అంటూ ఒక పాతికేళ్ళ యువకుడు గబగబా వీధిలోకి వెళ్ళిపోయాడు.

అవంతి ఇంట్లోకి పోయి, తండ్రిని, "ఈ గొడవంతా ఏమిటి, నాన్నా!" అని అడిగింది.

నీలకంఠం కోపంగా, "అన్ని సంగతులూ నీకు చెప్పాలా? వంట పనేదో చూడు," అన్నాడు.

ఏనాడూ పల్లెత్తుమాట అనని తండ్రి, యింత గట్టిగా కసురుకోగానే అవంతి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఒక అరగంట మౌనంగా గడిచాక నీలకంఠం ఎంతో శాంతంగా, "నీ పెళ్ళి వచ్చే నెలలోనే. అన్నీ నచ్చాయి, పదివేలు కట్నం కావాలి

మాచిరాజు కామేశ్వరరావు

అని వారం రోజుల క్రితం చెప్పిపోయారే, ఆ సంబంధం నిశ్చయపరచదలుచుకున్నాను,'' అన్నాడు.

''డబ్బు ఎక్కడ దొరికింది, నాన్నా?'' అన్నది అవంతి భయం, భయంగా.

''ఆ ఆరాలు నీకు అనవసరం, తెలిసిందా!'' అంటూ మంచం వాల్చుకుని పడుకున్నాడు నీలకంఠం.

అవంతి వంటగది సర్ది వచ్చేసరికి నీలకంఠం మంచి నిద్రలో వున్నాడు. ఆమె, తండ్రి బట్టలు పెట్టుకునే పెట్టె తెరిచి చూసింది. పెట్టె అడుగున ఒక తోలు సంచీ కనబడింది. దాని నిండా డబ్బున్నది. తండ్రి తన పెళ్ళికోసం చివరకు దొంగతనంలాంటి నీచానికి పాల్పడ్డాడా, అనుకుని అవంతి నివ్వెరపోయింది. ఆ తోలు సంచీని తన తలగడ దిండు కింద పెట్టుకుని, నిద్రపోయింది.

తెల్లవారగానే రాత్రి నీలకంఠంతో పోట్లాడిపోయిన యువకుడు వచ్చాడు. నీలకంఠం అతణ్ణి చూస్తూనే, ''ఇప్పటికి వందసార్లు చెప్పాను. నీ డబ్బు సంగతి నాకు తెలియదు, ఇక వెళ్ళు,'' అన్నాడు.

ఆ యువకుడు కోపం తెచ్చుకుని ఏదో అనబోయేంతలో అవంతి కల్పించుకుని, ''ఏదో డబ్బు గురించి మా నాన్నను బాధించడం, ఏం మర్యాద?'' అన్నది.



''ఇందులో బాధించడం ఏమీలేదు. జరిగిందేమిటో చెబుతాను, విను!'' అంటూ యువకుడు యిలా చెప్పాడు:

అతడి పేరు చంద్రం. ఒక నగల వ్యాపారి దగ్గిర గుమాస్తా. ఒక రోజున యజమాని పదివేలు ఒక తోలు సంచీలో పెట్టుకుని వ్యాపారం పని మీద బయలుదేరి వెళ్ళి, గంట గడిచే లోపలే విచారంగా దుకాణానికి తిరిగి వచ్చాడు. దారిలో డబ్బు సంచీని దొంగలెవరో తస్కరించారు. ఇది విని యజమానికన్నా చంద్రం ఎక్కువ బాధపడ్డాడు.

చంద్రం అన్న పట్నంలో వున్నాడు. అతడి ఆరోగ్యం బాగాలేదని తెలిసి చంద్రం



ఆ రాత్రే పట్నం బయలుదేరాడు. దారిలో ఒక చెరువుగట్టు పక్కనవున్న చెట్ల తోపు లోంచి అతడు నడుస్తూండగా, ఒక చెట్టు చాటునుంచి ఎవరో మాట్లాడుకోవడం వినిపించింది.

"ఈ డబ్బు మనలో ఎవరో ఒకరికి దక్కితే, కనీసం ఏడాదిపాటు దొంగ తనాల జోలికి పోకుండా సుఖంగా బతక వచ్చు. ఒక పని చేద్దాం. ఈ సంచీని యిక్కడ పెట్టి, చెరువుగట్టు' మీదికి పోదాం. అక్కడినుంచి ఎవరు ముందుగా వచ్చి, యీ సంచీని తాకితే, వాళ్ళది అందులో వున్న డబ్బు! ఏమంటావు ?'' అన్నాడొక దొంగ.

రెండోదొంగ యిందుకు సరేనన్నాడు. ఇద్దరూ సంచీ అక్కడపెట్టి, చెరువు గట్టు మీదికి వెళ్ళారు. చంద్రం చెట్టు చాటు నుంచి సంచీవున్న చోటుకువచ్చి, దాన్ని చూస్తునే నిర్ఘాంతపోయాడు. ఆ తోలుసంచీ తన యజమానిది!

చంద్రం చప్పున సంచీ తీసుకుని పరి గెత్త సాగాడు. దూరం నుంచి యిది చూసిన దొంగలు అతడి వెంటబడ్డారు.

చంద్రం చాలాదూరం పరిగెత్తి, నీల కంఠం వాళ్ళ గ్రామం చేరాడు. వీధుల్లో యింకా జనసంచారం ప్రారంభం కాలేదు. తను దొంగలకు దొరికిపోయినా, యజమాని డబ్బు సంచీ దొంగలపాలవ గూడదనుకుంటూ, అతడు వీధి పక్కన వున్న ఒక ఇంటి అరుగుకు అడ్డంగావున్న మేదరితడిక వెనక్కు దాన్ని విసిరి వేశాడు.

అతడు గ్రామం దాటి మరికొంతదూరం పరిగెత్తేసరికి, బాగా తెల్లవారిపోయింది. ఇక లాభంలేదని దొంగలు ఎటో వెళ్ళి పోయారు. చంద్రం పట్నం వెళ్ళి, అన్న ఆరోగ్యం కొంత బాగయిందని తెలుసు కుని, నీలకంఠం వుండే గ్రామానికి తిరిగి వచ్చాడు. ఇప్పుడు నీలకంఠం ఆ డబ్బు సంచీ సంగతి తనకు తెలియదని అబద్ధ మాడుతున్నాడు!

అంతావిన్న అవంతి చంద్రం స్వామి భక్తికి ఆశ్చర్యపోయి, తన తలగడకింద వున్న డబ్బు సంచీని అతడికి యివ్వబోయింది. కానీనీలకంఠం ఆమెకుఅడ్డువచ్చి, "సంచీ యివ్వకు. ఇతను చెప్పేదంతా పెద్ద కట్టుకథ. ఆ డబ్బు సంచీ నాకెలా దొరికిందో చెబుతాను విను," అంటూ యిలా చెప్పాడు:

అతడు కూతురు కట్నం. డబ్బుకోసం ఒకటి, రెండు చోట్ల ప్రయత్నించి, పని కాక నిరాశగా ఇంటికి బయలుదేరాడు. ఆ క్షణంలో అతడికి జీవితం మీద రోత పుట్టింది. ఒక్కగానొక్క కూతురుకు పెళ్ళి చేసే శక్తిలేని తాను బతికుండి ప్రయోజనం ఏమనుకుంటూ దారిపక్కనే వున్న ఒక పాడుపడ్డ బావికేసి తడబడుతున్న అడుగులతో నడవసాగాడు.

నీలకంఠానికి కొంచెం వెనగ్గా వస్తున్న ఒక నడివయసువాడు, అతడి తడబాటు గమనించి, చప్పునవచ్చి భుజం పట్టుకుని, "ఆగు. నువ్వేదో అఘాయిత్యానికి తలబడినట్టున్నది! కారణం ఏమిటి?" అన్నాడు.

నీలకంఠం కళ్ళ నీళ్ళు పెట్టుకుని, "ఒక్కగానొక్క కూతురుకు పెళ్ళి చేయలేని నేను బతికుండి ప్రయోజనం ఏమిటి?" అన్నాడు.

ఆ జవాబుకు అతడు నవ్వి, "నాకు పదిమంది ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేయగల స్తోమతున్నది గాని, పిల్లలు లేరు. ఈ డబ్బు నాదికాదు, అయినా తీసుకో.





నీ చిరునామా యిచ్చావంటే, నెలకింత అని వసూలు చేసుకుంటాను,'' అంటూ ఒక తోలుసంచీని నీలకంఠానికి యిచ్చాడు.

''ఆయన పేరు రాజయ్య. ఆయన నాకు సంచీ యివ్వడం చాటున వుండి చూసి, ఈ చంద్రం కాజెయ్యాలని ప్రయత్నం చేస్తున్నాడు. అవంతీ, ఇతడి మాటలు నమ్మకు. సాక్ష్యం చెప్పడానికి, ఆ రాజయ్య ఎక్కడ వుంటాడో తెలియదు,'' అన్నాడు నీలకంఠం చిరాగ్గా.

అంతలో రాజయ్య వీధిలోంచి గడప దగ్గిరకు వచ్చి, ''అంత చీకట్లో కూడా, యీ ఇంటిని బాగా గుర్తు పెట్టుకున్నానన్న మాట!'' అన్నాడు నవ్వుతూ.

నీలకంఠం కూతురుకు రాజయ్యను పరిచయం చేశాడు. ఆమె జరిగినదంతా ఆయనకు చెప్పి, ''ఈ చిక్కుముడిని మీరే ఊడదీయాలి!'' అన్నది.

''అదెంతపని!'' అని రాజయ్య జరిగింది యిలా చెప్పాడు:

ఆయన పట్నంలో బంధువులింట పెళ్ళి కని, సూర్యోదయానికి కొంచెం ముందుగా బయలుదేరాడు. నీలకంఠం వాళ్ళగ్రామం చేరి, అతడి ఇంటి వీధిలోకి వచ్చేసరికి వర్షం ప్రారంభమైంది. తలదాచుకునేందుకు ఇంటి అరుగుమీదికి చేరిన రాజయ్యకు తడిక పక్కన సంచీ ఒకటి కనిపించింది. తీసి చూడగా లోపల చాలా డబ్బు! ఇంటికి తాళం వేసివున్నది. ఇంటివాళ్ళు ఎక్కడికో వెళ్ళే తొందరలో సంచీ అక్కడ జారవిడిచి వుంటారనీ, తిరుగు ప్రయాణంలో వాళ్ళకు అప్పగించవచ్చుననీ అనుకుని, వాన వెలవగానే ఆయన ప్రయాణమైపోయాడు.

దారిలో ఒక చోట ఆ డబ్బును పాడుబడిన బావికేసి పోతున్న నీలకంఠానికి యివ్వడం జరిగింది. అప్పట్లో రాజయ్యకు తనకు డబ్బు సంచీ దొరికిన ఇల్లు నీలకంఠానిదని తెలియదు. తిరిగి ఆయన ఇంటికి పోయి, తనకు సంచి దొరికిన ఇంటివాళ్ళకు జరిగిన సంగతి చెప్పి,

డబ్బు యిద్దామని, డబ్బు తీసుకుని బయలుదేరి వచ్చాడు.

ఇంత చెప్పి రాజయ్య, నీలకంఠంతో, "నేను మీకిచ్చిన డబ్బు సంచీ చంద్రం యజమానిదే అయివుంటుంది. దాన్ని చంద్రానికి యిచ్చెయ్యండి. మీకు కాబోయే అల్లుడికి యివ్వవలసిన కట్నం పదివేలూ నేనిస్తాను," అని, చంద్రం కేసి పరీక్షగా చూస్తూ, "ఆ కాబోయే అల్లుడు యీ కుర్రవాడిపాటివుంటాడా?" అని అడిగాడు.

"ఏదో పెళ్ళి చూపులకంటూ వచ్చి పోయిన అతణ్ణి గురించి లోతుగా తెలుసుకునే అవకాశం నా కెక్కడుంది? తల్లిదండ్రులు పదివేలు కట్నం కావాలంటే, గంగిరెద్దులా తలూపాడు, అంతే!" అన్నాడు నీలకంఠం అక్కసుగా.

రాజయ్య, యీసారి చంద్రం భుజం తట్టి, "నీ యజమాని పోయిందని చేతులు దులిపి వేసుకున్న డబ్బును, తిరిగి ఆయన పరంచేసేందుకు నీవు పడ్డ శ్రమా, నీ నిజాయితీ నాకు బాగా నచ్చాయి. నీలకంఠంగారూ, అవంతి ఒప్పుకుంటే మాట! నీకు పెళ్ళయిందా? కాకపోతే, ఏపాటి కట్నం కావాలి?" అన్నాడు.

చంద్రం నీలకంఠం కేసీ, అవంతి కేసీ చూశాడు. నీలకంఠం అతడి కేసి ఆప్యాయంగా చూస్తున్నాడు; అవంతి సిగ్గుతో తల వంచుకుని నేలచూపులు చూస్తున్నది.

"తనపెళ్లి తప్పిపోయినా సరే అని డబ్బు సంచీ నాకివ్వబోయిన అవంతి మంచితనం నాకు చాలా నచ్చింది. కట్నం కారణంగా యింత గొడవ జరిగాక, యింక నేను కట్నం అడగడమేమిటి?" అన్నాడు చంద్రం.

రాజయ్య, నీలకంఠం, అవంతిల కేసి చూసి, వాళ్ళు ఆనందపడుతూండడం గ్రహించి, "వచ్చే నెలలోనే పెళ్ళి ముహూర్తం, యిక్కడ కాదు, నా ఇంట్లో. పదిమంది ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేయగల స్థోమతుగలవాడనని లోగడే నీలకంఠం గారికి చెప్పాను," అన్నాడు.



# మారని బుద్ధి

ఒక గ్రామంలో జోగయ్య అనే పాలవ్యాపారి వుండేవాడు. అతణ్ణి వాడకందార్లు ఎన్నిసార్లు కోప్పడినా, హెచ్చరించినా పాలల్లో నీళ్ళు కలపడం మానలేదు. చివరికి గ్రామపెద్దలు అతడి పశువుల్ని లాక్కుని, గ్రామం నుంచి తరిమేశారు.

జోగయ్య మరెక్కడైనా బతుకు తెరువు చూసుకుందామనుకుంటూ ఒక కొండ మార్గాన పోతూండగా, వాడికి ఒక కొలను పక్కన వున్న గుహ ముందు యోగి ఒకాయన కనిపించాడు.

జోగయ్య, యోగికి నమస్కరించి, తన కథ అంతా చెప్పుకుని, "స్వామీ, యిప్పటికి బుద్ధి వచ్చింది. నాకు పాలవ్యాపారం తప్ప, మరేం చేతకాదు. మీరు కరుణించాలి," అన్నాడు.

యోగికి అతడి మీద జాలి కలిగింది. ఆయన కొలనును జోగయ్యకు చూపుతూ, "ఇక నుంచి, ఆ కొలనులో నీళ్ళకు బదులు పాలుండబోతున్నవి. సుఖంగా బతుకు," అన్నాడు.

జోగయ్య, యోగికేసి రెండు చేతులూ జోడించి, "ఈ పాలకొలను పక్కనే, రెండు నీటి కొలనులు కూడా సృష్టించి యివ్వండి," అని కోరాడు.

—కాశీనాథ్ & కాశీనాథ్






పాలసముద్రంలో ఉన్న త్రికూటపర్వతానికి ఇనుము, వెండి, బంగారాల మూడు శిఖరాలు; ఆ శిఖరాల నడుమ ఫలవృక్షాలతో నిండిన మహారణ్యం. ఆ వనంలో గజేంద్రం అనే మదపుటేనుగు తన భార్యలైన దశలక్షకోటి ఆడ ఏనుగులతో విహరిస్తూ దాహం తీర్చుకోడానికి మహావనం మధ్యనున్న సరోవరానికి బయలుదేరింది.

దాహం తీరాక జలవిహారంపై బుద్ధి పుట్టి, తన ఆడ ఏనుగులతో సరోవరాన్ని అల్లకల్లోలం చేస్తూ విజృంభించి జలకేళిలో లీనమై ఉన్న గజేంద్రాన్ని, గొప్ప మొసలి కోరలు గుచ్చి ముందరి కుడి కాలు పట్టుకొన్నది.

బాధతో గజేంద్రం చేసిన ఘీంకారానికి ఆడ ఏనుగులు బెదిరి చెల్లాచెదరుగా సరోవరం చుట్టూరా ఒడ్డు చేరుకొని, గజేంద్రం పడుతూన్న బాధ చూసి ఏడుస్తూ నిలబడ్డాయేగాని, మొసలి పట్టునుండి ఎలా తప్పించాలో వాటికి తోచలేదు.

గజేంద్రం మొసలి బారినుండి తప్పించుకోడానికి ఎన్ని ప్రయత్నాలు చెయ్యాలో అన్నీ చేస్తూ తల్లడిల్లిపోసాగింది. ఏనుగులు శోకాలు పెడుతూనే, ఆకలి తీర్చుకుంటూ, వేరే జలాశ్రయాలకు వెళ్ళి నీరు తాగి వస్తూపోతూ సరోవరం చుట్టూ తిరుగుతూ కన్నీరు కారుస్తున్నాయి. సరోవరంలో కరిమకరాల పోరాటం సాగుతూనే ఉన్నది.

1. ఆదిమూలావతారం



ఏనుగు దంతాలతో మొసలిని పొడిచేది. మొసలి ఎగిరి మీదపడి ఏనుగు శరీర మంతా రక్తధారలు కారేట్లుగా వాడి గోళ్ళతో రక్కేది.

ఏనుగు తొండంతో మొసలి వీపు బాదేది. మొసలి కరుకుల తోకతో ఏనుగును ఎడా పెడా కొట్టేది.

ఏనుగు మొసలి మీద పడి నాలుగు కాళ్ళతో కుమ్మేయాలని చూస్తే, మొసలి నీటి అడుగున దాగి ఉండేది. ఏనుగు ఎంతకూ మొసలి జాడ లేకపోవడం చూసి ఒడ్డు చేరబోతూంటే, తటాలున మకరం ఏనుగును పట్టుకొని లాక్కుపోయి నీట ముంచేది. అలాగ ఎన్నిసార్లో ఏనుగును ముప్పతిప్పలు పెట్టింది. ఏనుగుకూ మొసలికీ నిర్విరామంగా పోరాటం వెయ్యి సంవత్సరాలు సాగింది.

గజేంద్రం స్వశక్తిని నమ్ముకొని ఎంత సాహసించి పోరాడినా క్రమక్రమంగా శక్తి సన్నగిల్లింది. మొసలి జలగ్రహం! నీటిలో దాని బలం ఎక్కువ. ఏనుగు రక్తం పీలుస్తూ అది మరింత బలంతో బాగా ఒళ్ళు పెంచింది. ఏనుగు బొమికలతో మిగిలింది. మొసలి పట్టునుండి మోక్షం పొందడం మరింక దానికి సాధ్యం కాదు!

''దాహం తీర్చుకోడానికి ఈ సరోవరానికి నేరక వచ్చాను. దాహం తీర్చుకొని వెళ్ళిపోకుండా సరస్సులో ఎందుకు దిగాను? నా పాడు బుద్ధే నన్ను మొసలికి పట్టి ఇచ్చింది!'' అంటూ గజేంద్రం చింతించడం మొదలు పెట్టింది.

''నన్నెవరు రక్షిస్తారు? ఎవరిని పిలవాలి? నన్ను నేను రక్షించుకోలేని స్థితిలో ఉన్న నా మనస్సులో ఏ మూలనో నేను కాపాడబడగల అవకాశం ఏదో ఉన్నదనే ఆశ! ఆ ఆశవల్లనే రక్షణ కోరుకుంటున్నాను! అంటే నా ఆశకు ఆధారం ఏదో ఉండి తీరాలి! అదే దేవుడని పిలుస్తున్నాను!

దేవుడు, భగవంతుడు, ఈశ్వరుడు అనే భావనకు ఆదిమూలమైన ఓ దేవుడా! కారణాలన్నిటికీ నువ్వే కారణానివి!

నాలాంటి మదగర్వితులైన మంద మదమతి జీవులు ఆపద రానంతవరకు నిన్ను తలచవరు! బాధపడితేనేగాని నీ అవసరం బోధపడదు. ఉన్నాడు ఉన్నాడు అనేవాడు ఉన్నాడో, లేడో అనే ఆందోళన పడందే నువ్వు కనిపించవు!" అని పరిపరి విధాల చింతనలో పడ్డ గజేంద్రానికి మొసలి పెడుతున్న బాధ కొంత తగ్గినట్లు అయింది.



ఎప్పుడైతే గజేంద్రుడు చింతన మొదలు పెట్టాడో, ఆ క్షణంలోనే మొసలి కోరల కుదుళ్ళలో సలుపు పుట్టింది, గుండె దడ చురుక్కుమనిపించింది. అయినా అది మరింత రోషంతో గజేంద్రం కాలిని నొక్కి, నొక్కి పిప్పి చేస్తూనే ఉన్నది.

"జీవుల చెడ్డనూ, బాధనూ హరించే వాడివి! అంతటా ఉండేవాడివి, వ్యాపిస్తూనే ఉండేవాడివి!

దేవుళ్ళకు మూలమైన దేవుడా! ఈ జగత్తు జనించే హేతువుకి నువ్వే మూల హేతువు! నన్ను రక్షించమని ఎంత బలంగా నిన్ను కోరుతానో అంత వేగంగా నన్ను నీవు రక్షించుతావని నమ్ముతున్నాను, రక్షించితీరగలవు!

అన్నీ నువ్వే అవుతూ మాటకూ, మనస్సుకూ అందనివాడివిగా ఉండే ఓ సర్వేశ్వరుడా! నాలాంటి దీనులను ఆదుకొనే బాధ్యత నీదే కదా!

జీవశక్తులన్నీ నశించిపోయిన నాలో, ఇప్పుడు కన్నీరు హరించిపోయింది. నిన్ను ఎలుగెత్తిపిలవలేను సరికదా, నా నుండి చిన్న మూలుగు కూడా రాదు, స్పృహ కూడా తప్పుతున్నది.

నన్ను రక్షించినా మానినా అంతా నీ యిష్టం! నీవు తప్పితే నాకు యింకేదిక్కూ, ధ్యాసా లేదు!" అంటూ గజేంద్రుడు శక్తినంతా కూడదీసుకొని తొండాన్ని ఎత్తి పిలుస్తున్నట్లుగా తిన్నగా చూశాడు.



మొసలికి బలం తగ్గిపోతున్నదని పించింది, నోరు జారుతున్నట్లు, కంఠం బిగుసుకుంటున్నట్లు తోచింది.

తాను ఉన్నదీ లేనిదీ తెలియని స్థితిలో ఏనుగు కళ్ళు మూత పడుతూంటే, అలాగే ఏ మాత్రం చలనం లేకుండా ఉండిపోయింది.

అప్పుడు విష్ణువు వచ్చాడు.

ఆకాశమంతా అతని రూపంతో నిండి పోయింది. తానొక సూక్ష్మమైన అణువును అని గజేంద్రానికి అనిపించింది.

వస్తూనే విష్ణువు చేతనున్న చక్రాన్ని విడిచాడు. అభయముద్రగా పతాక హస్తం పట్టాడు.

ప్రచండ వేగంతో గిర్రున తిరుగుతూ వచ్చి విష్ణుచక్రం మొసలి తల నరికింది.

మొసలి ఒక గంధర్వుడు. హుహూ అనేది అతడి పేరు. దేవలుడు అనే ఋషి నీటిలో నిల్చుని ఉండగా నీటిలోంచి కనపడకుండా వెళ్ళి మొసలిలాగ, ఋషి కాలు పట్టుకున్నాడు. ఋషి ఆ గంధర్వుణ్ణి మొసలిగా పడి ఉండు అని శపించాడు. విష్ణు చక్రంతో ఆ శాపం తీరింది.

మొసలి బారినుండి విముక్తి పొందిన గజేంద్రాన్ని సరస్సు నుండి వెలుపలికి లాగి విష్ణువు అరచేత్తో దాని కుంభస్థలాన్ని నిమిరాడు. ఆ స్పర్శకు గజేంద్రం పోయిన జవసత్వాల్నీ, శరీరపుష్టినీ తిరిగిపొందింది, పూర్వజన్మ జ్ఞానం కూడా కలిగింది.

గజేంద్రం వెనకటి జన్మలో విష్ణుచింతనా తత్పరుడైన ఇంద్రద్యుమ్నుడనే మహారాజు. విష్ణుధ్యానంలోవున్న అతను అగస్త్య మహర్షి రాకను గమనించ లేదు. ఋషి కోపగించి మదగజమై పుట్టుదువు గాక అని శపించాడు. ఆ రాజే గజేంద్రంగా పుట్టి మోక్షణపొందాడు.

గజేంద్రమోక్షణ కథను సూతమహర్షి నైమిశారణ్యంలో జరుగుతున్న సత్రయాగానికి వచ్చిన శౌనకాది మునులకు చెప్పాడు.

మునులు సూతుడితో, "మునీంద్రా! గజేంద్రమోక్షణ కథ కేవలం ఒక ఏనుగుకు చెందినదిగా లేదు. జీవకోటి అంతకూ ముఖ్యంగా అనేక బంధాలతో బాధలో చిక్కుకుని సతమతమయ్యే మానవజీవికి వర్తించే కథలాగ వున్నది," అని అన్నారు.



సూతుడు, "ఔను, గజేంద్రమోక్షం అంతరార్థంతో కూడినదే! ఎవరు ఎలాగ అన్వయించుకున్నా సరిపోతుంది. కాలం విష్ణువు అధీనంలోనే ఇమిడి వున్నది. కాలచక్ర భ్రమణంలో ఎన్నో సమస్యలూ, కష్టాలూ సమసిపోతూంటాయి," అని చెప్పాడు.

మునులు, "మునివర్యా! గజేంద్ర మోక్షాన్నిబట్టి కారణకారణుడు, సర్వేశ్వరుడు విష్ణువు అని తెలుస్తున్నది. అటువంటి విష్ణుకథను పూర్తిగా వినాలని ఉవ్విళ్లూరుతున్నాం. నీ ముందు మేము పిల్లలవంటి వాళ్ళం. కనుక విష్ణువును గూర్చిన విశేషాలన్నీ మాకు సులభంగా బోధపడేలాగ వినిపించ ప్రార్థిస్తున్నాం. వ్యాసమహర్షి వలన సమస్త పురాణాలనూ ఇతిహాసాలనూ, వాటిలోని విశేషార్థాలనూ ఎరిగిన నీవు ఒక్కడివే మమ్మల్ని కృతార్థుల్ని చేయగలవు!" అని అన్నారు.

సూతుడు వారి మాటలకు సంతసించి, "అలాగే విందురుగాని. వ్యాసమహర్షి విష్ణువును గురించిన అనేక లీలావతార విశేషాంశాలతో ప్రత్యేకంగా మహాభాగవతాన్ని రచించి, తనకుమారుడైన శుకునికి బోధించాడు. విష్ణుకథను విని తరింపగోరిన పరీక్షిత్తు మహారాజుకి శుకయోగి దాన్ని చెప్పాడు. గజేంద్రాన్ని రక్షించ వచ్చిన విష్ణువు అవతరణ 'ఆదిమూలావతారం' అని పేర్కొనబడింది.

విష్ణువు అనేక అవతారాలు ఎత్తాడు. వాటిలో పరిణామ దశలను అనుసరించే దశావతారాలు అనబడే పది అవతారాలు ముఖ్యమైనవి.

నారము అంటే నీరు. నీటికి మూలమైనవాడు కనుకనే విష్ణువు నారాయణు




డైనాడు. నారాయణుడి నుండి నీరు పుట్టింది. నీటినుండి జీవం పుట్టింది. విష్ణువు జలచరమైన చేపగా అవతరించాడు. అదే మత్స్యావతారం! దశావతారాల్లో మత్స్యావతారం మొదటిది.

విష్ణువు నీటితో నిండిన నీలమేఘం రంగులో ఉంటాడు. మేఘంలో మెరుపు వున్నట్టే విష్ణువు తేజోమయుడు. అతని నుండి వచ్చిన జలం కూడా తేజస్సుతో నిండి తెల్లని వెలుగు చిమ్ముతూంటుంది. ఆ జలమే కారణోదక క్షీరసాగరం!

క్షీరసాగరంలో అనంతమైన కాలం శేషసర్పం రూపంతో చుట్టలు చుట్టుకొని ఉంటుంది. శేషువుకి వెయ్యి పడగలు. చివర అంటూలేని శేషువుపై శేషశాయిగా విష్ణువు పవ్వళించి వుండగా, అతని బొడ్డు నుండి నాళంతో గొప్పపద్మం పైకిలేచింది. ఆ పద్మంలో బ్రహ్మ ఆవిర్భవించాడు. బ్రహ్మ అన్నిటినీ సృజించాడు.

అనంతమైన కాలం యుగాలుగా సాగుతూంటుంది.

కృత - త్రేతా - ద్వాపర - కలియుగాలు కలసి ఒక మహాయుగం.

వెయ్యి మహాయుగాలు కలిసి ఒక కల్పం. కల్పం బ్రహ్మకు ఒక పగలు. పగలు పూర్తికాగానే అతనికి నిద్ర ముంచుకొస్తుంది. అదే కల్పాంతం. అప్పుడు అంతటా గాఢాంధకారం అలుముకొంటుంది. విష్ణువు నుండి వెలువడిన సంకర్షణాగ్ని వేడిమి అన్నిటినీ మాడ్చివేస్తుంది. పెనుగాలులు వీస్తుంటే కారుమేఘాలు గుంపులు గుంపులుగా ఏనుగుతొండాల్లాంటి జలధారలు ఎడతెరిపి లేకుండా కురుస్తాయి. మహాసముద్రం ఆకాశాన్నంటి పొంగుతుంది. భూ, భువర్, స్వర్లోకాలు మునిగిపోతాయి. ఎటు చూసినా జలబీభత్సం తప్పితే మరేమీవుండదు. ఆ విధంగా ప్రళయం సంభవిస్తుంది. బ్రహ్మ నిద్రపోయే రాత్రి అంతా ప్రళయకాలం!

అది కల్పాంతం దగ్గిర వుతూన్న సమయం:

సత్యవ్రతుడు అనే రాజర్షి నదిలో స్నానం చేసి నారాయణ ధ్యానం చేసి, అర్ఘ్యం యివ్వబోయేటప్పుడు, అతని దోసిట్లోకి బంగారం రంగులో వున్న చిన్న చేప వచ్చింది. సత్యవ్రతుడు దాన్ని నదిలో విడిచిపెట్ట బోతూంటే, ఆ చిన్నారి చేప, "ఓ రాజా! మా చేపజాతి మంచిదికాదు. చిన్న చేపల్ని పెద్ద చేపలు మింగేస్తాయి. వాటి నుంచి తప్పించుకున్నా, జాలర్లు వలపన్ని పట్టి చంపుతారు. అందుచేత, నీ రక్షణకోరి నీ దోసిలిలోకి వచ్చాను, నిర్దయగా నన్ను విడిచిపెట్టకు!" అని పలికింది.

సత్యవ్రతుడు చేపను తన కమండలంలో వుంచి తన నగరికి తీసుకు వెళ్ళాడు. సత్యవ్రతుడు మహారాజుగా రాజ్యపాలన చేస్తూనే గొప్ప తపస్సుచేసిన రాజఋషి. విష్ణుభక్తి తత్పరుడు, గొప్ప జ్ఞానసంపన్నుడు.

కమండలంలో ఉంచిన చేపపిల్ల, మర్నాటికే నిండుగా పెరిగి ఉక్కిరి బిక్కిరవుతూ, "రాజా! నన్ను ఇందు లోంచి తీసి, కాస్త పెద్ద చోటులో చేర్చు!" అంటూ ఆర్తనాదం చేసింది.

ఆ చేపను పెద్ద నీటి తొట్టెలో విడిచిన కొద్దిసేపటికే చేప ఎదిగి అది కూడా చాలకపోగా, సత్యవ్రతుడు దాన్ని చిన్న మడుగులో వేశాడు. చేప పెరిగిపోతూనే ఉంది. మడుగు నుండి పెద్ద సరోవరానికీ, సరోవరం నుండి మహాజలాశ్రయానికీ చేర్చినా, అలా పెరిగిపోతూన్న మహా మత్స్యాన్ని సముద్రానికి చేర్చగా, "ఓ రాజర్షీ! నీ రక్షణ కోరిన నన్ను సముద్రంలో వదిలిపోతావా? ఇది న్యాయమేనా? మొసళ్ళు, తిమింగలాలు నన్ను మింగవా?" అని మత్స్యం నిలదీసి అడిగింది.

సత్యవ్రతుడు, "ఓ మహామీనమా! ఇంతకంటే నేను చేయగల్గిందేముందో నువ్వే చెప్పు! క్షణానికి శత యోజనాలు పెరిగేలా ఉన్న నిన్ను ఏదీ మింగలేదు కదా!" అన్నాడు.





# అనేక హంతకులు

చాలాకాలం క్రితం చీనాదేశంలో ఒక ధనికుడైన దర్జీవాడు ఉండేవాడు. అతను వినోదప్రియుడు. అప్పుడప్పుడూ తన భార్యను వెంటబెట్టుకొని నగరంలోని వినోదాలు చూస్తూ రోజల్లా తిరిగేవాడు.

ఒకనాడు అలాగే దర్జీ తన భార్యతో సహా నగరమంతా తిరిగి సాయంకాలమయాక ఇంటికి తిరిగివస్తూండగా వాళ్ళకొక మరుగుజ్జువాడు కనిపించాడు. ఆ మరుగుజ్జు రకరకాల హాస్యాలు చేసి, తన చుట్టూ వున్న వాళ్ళను కడుపుబ్బ నవ్విస్తున్నాడు. అందరితోపాటు దర్జీ, అతని భార్య కూడా మరుగుజ్జు వాడి హాస్యాలకు విరగబడి నవ్వి, ఆ రాత్రికి వాణ్ణి తమ అతిథిగా ఆహ్వానించారు.

మరుగుజ్జు వాణ్ణి ఇంటికి తెచ్చి, దర్జీవాడు దుకాణానికి వెళ్ళి, వేయించిన చేపలూ, రొట్టెలూ, నిమ్మకాయలూ, తెల్ల నువ్వుల హల్వా కొని తెచ్చాడు. తరవాత ముగ్గురూ భోజనానికి ఉపక్రమించారు.

భోజనం ఉల్లాసంగా జరిగిపోతూండగా దర్జీవాడి భార్య ఒక పెద్ద చేప ముక్కను తీసుకుని మరుగుజ్జు వాడి నోట కుక్కి, వాడి నోరు గట్టిగా మూసి, "అంతా ఒక్కసారే మింగాలి," అన్నది. అతికష్టం మీద మరుగుజ్జువాడు దాన్ని మింగటానికి యత్నించాడు. దురదృష్టవశాన ఆ చేప ముక్కలో పెద్ద ముల్లుండి, అది మరుగుజ్జువాడి గొంతులో గుచ్చుకున్నది. వాడు గుడ్లుతేలవేసి, ప్రాణాలువదిలాడు. అది చూసి దర్జీవాడు, "అరే, అల్లా! పాపం వీడి ప్రాణాలు మన చేతిమీదుగా పోయాయే. ఎలాటి దురదృష్టం వచ్చి పడింది!" అని వాపోసాగాడు.

"ఏడిచి ఏం లాభం? చేయవలసింది ఆలోచించాలి గాని," అన్నది దర్జీ భార్య.

అరేబియన్ నైట్స్ కథ



"ఏం చేద్దామంటావు ?" అని దర్జీ వాడు అడిగాడు.

"వీడి పైన బట్టకప్పి భుజానికెత్తుకో. ఇద్దరమూ మన బిడ్డకు రోగం వచ్చినట్టు నటిస్తూ, వైద్యుడి కోసం బయలు దేరుదాం," అన్నది భార్య.

దర్జీవాడు మరుగుజ్జు శరీరం మీద ఒక బట్ట కప్పి, ఎత్తుకుని వీధిలోకి వచ్చాడు. అతని భార్య ముందు నడుస్తూ, "అయ్యో, నా బిడ్డకు మాయదారి మశూచికం వచ్చిందే! ఎవరు రక్షిస్తారు ? మా కష్టం ఎవరు తీరుస్తారు ? ఏ వైద్యుడన్నా దొరికితే బాగుణ్ణు !" అని గట్టిగా ఆక్రోశించ సాగింది.

మశూచికమనే మాట వినగానే వీధిలో వాళ్లు దర్జీవాడికి దూరంగా తొలిగారు. దర్జీ భార్య వాళ్ళను, "వైద్యుడిల్లెక్కడ బాబూ ? వైద్యుడింటికి దారి ఏది నాయనా ?" అంటూ అడిగింది. చివరకు ఎవరో వాళ్ళకొక వైద్యుడి యిల్లుచూపారు.

దర్జీవాడు వైద్యుడింటి తలవాకిలి తడితే, ఒక నీగ్రో బానిస వచ్చి తలుపు తెరిచింది. దర్జీవాడి భార్య ఆమెతో "మా బిడ్డకు చాలా సుస్తీగా వున్నది. వైద్యుడిగార్ని త్వరగా వచ్చి చూడమని చెబుతారా ?" అంటూ ఆ బానిస చేతిలో ఒక వెండికాసు పెట్టింది.

ఆ మాట చెప్పటానికి నీగ్రో బానిస మేడ మీదికి వెళ్ళగానే, భార్యాభర్త లిద్దరూ లోపలికి అడుగుపెట్టి, మరుగుజ్జు వాడి శవాన్ని, మెట్ల మీద పెట్టేసి, కాలి సత్తువకొద్దీ పారిపోయారు.

ఈ లోపల నీగ్రో బానిస మేడ మీద వైద్యుడి చేతిలో వెండికాసు పెట్టి, ఎవరో వైద్యానికి వచ్చారని చెప్పింది. వైద్యుడు ఆ కాసు చూసిన ఆనందంలో దీపం తీసుకోవాలన్న సంగతి మరిచిపోయి, గబగబా మెట్లుదిగివస్తూ, చీకట్లో మరుగుజ్జు వాడి శరీరాన్ని తన్నాడు. ఆ శరీరం మెట్ల మీది నుంచి దొర్లి కిందపడిపోయింది. వైద్యుడు కిందికి వచ్చి చూస్తే శవం !

ఇది తాను చేసిన హత్యే అనుకుని వైద్యుడు కంగారు పడిపోయి, శవాన్ని ఏం చెయ్యాలా అని ఆలోచించాడు. ఆయన దాన్ని తన భార్య వద్దకు తీసుకుపోయి, జరిగినది చెప్పాడు.

"ఇది ఈ ఇంట్లో ఉండటానికి వీల్లేదు. దీన్ని డాబా మీదికి తీసుకుపోయి మన పొరుగున ఉన్నవాళ్ళ దొడ్లో పడేద్దాం. ఆ ఇంటివాడు సుల్తానుగారి పాకశాలాధికారి. వాళ్ళ ఇంటి నిండా అంతులేని పిల్లులూ, కుక్కలూ, ఎలకలూనూ. అవి శవాన్ని క్షణాల మీద తిని పారేస్తాయి," అన్నది వైద్యుడి భార్య.



సరే, భార్యాభర్తలిద్దరూ డాబా మీదికి వెళ్ళి, పక్క ఇంటివాడి వంటగది గోడకు చేరబడేలాగా మరుగుజ్జువాడి శరీరాన్ని, జాగ్రత్తగా దించి, పీడ వదిలించుకున్నారు.

మరుక్షణమే పక్క ఇంటివాడు ఎక్కడినుంచో ఇంటికి తిరిగివచ్చి, మైనం వత్తి వెలిగించి, దాని వెలుగులో, తన వంట ఇంటి గోడ నానుకుని ఎవరో కదలకుండా నిలబడి వుండటం కనిపెట్టాడు.

అతని ఇంట తిండి పదార్థాలు తరుచూ మాయమవుతూవుండేవి. ఆ దొంగతనం చేస్తూన్నది ఏ పిల్లులో, కుక్కలో అని అతను అనుకుంటూ వచ్చాడు. ఇప్పుడతను, "ఓహో! ఈ ఇంటి దొంగ మనిషేనా? పక్కింటి డాబా మీదుగా దిగాడన్నమాట," అనుకుని, ఒక దుడ్డు కర్ర తెచ్చి, ఒక్క దెబ్బతో మరుగుజ్జును పడగొట్టి, అంతతో కసి తీరక, అదే పనిగా శవాన్ని బాదాడు.

ఎన్ని కొట్టినా, "దొంగ" ఉలకడు, పలకడు! ఆ మనిషి వంగి చూస్తే శవం!

"అయ్యో, నా కొంప ముంచావురా మరుగుజ్జువాడా! నా ఇంట దొంగతనం చేసి నష్టం కలిగించింది చాలక, చచ్చి నా ప్రాణం మీదికే తెచ్చావా? అల్లా, నువ్వే నన్ను కాపాడాలి," అని ఆక్రోశించసాగాడు.



అతను ఆ శవాన్ని మోసుకుని పోయి, ఒక దుకాణం మొగదల శవాన్ని నిలబెట్టి తన దారిన తాను వెళ్ళాడు.

కొంతసేపటికి ఒక వడ్డీ వ్యాపారస్థుడు తప్ప తాగి, మైకం పోవటానికి స్నానశాలకు తూలుతూ పోతూ అటుగా వచ్చాడు. మరుగుజ్జువాణ్ణి చూడగానే ఆ వ్యాపారస్థుడికి, ఆ నిలబడి ఉన్న వాడు దొంగ అని అనుమానం కలిగింది. ''దొంగ పట్టుకోండి,'' అని కేకలు వేస్తూ అతను మరుగుజ్జువాడి మీదికి లంఘించి, శవాన్ని పడదోసి, చేతులతో బాదసాగాడు.

తాగుబోతువాడి కేకలు విని రాత్రి కాపలా వాళ్ళు, పరిగెత్తుకుంటూ వచ్చి, కింద పడినవాణ్ణీ, కొడుతున్నవాణ్ణీ చూశారు. కిందపడివున్న మనిషిలో ప్రాణంలేదు.

''నువు హత్య చేశావు! వలీ దగ్గరకు పద,'' అని కాపలావాళ్ళు మరుగుజ్జువాడి శవాన్నీ, వ్యాపారస్థుణ్ణీ, కొత్వాలు దగ్గిరికి తీసుకుపోయారు.

జరిగిన సంగతి అంతా విని కొత్వాలు వడ్డీ వ్యాపారస్థుణ్ణి తెల్లవారగానే ఉరి తీయవలసిందిగా తన భటులకు ఉత్తరు విచ్చాడు.

తెల్లవారగానే వ్యాపారస్థుడి ఉరిశిక్ష గురించి నగరమంతటా చాటింపు జరిగింది. జనం ఉరి తీసే చోటికి గుంపులు గుంపులుగా చేరారు. వ్యాపారస్థుణ్ణి వధ్యస్థానంలో నిలబెట్టి, భటులు మెడకు ఉచ్చు కూడా తగిలించారు.

అంతలో సుల్తానుగారి పాకశాలాధికారి, పరిగెత్తుకుంటూ వచ్చి, ''ఆగండి, ఆగండి! ఆ మరుగుజ్జును హత్య చేసిన వాణ్ణి నేను!'' అన్నాడు. ''నువ్వు హత్య ఎందుకు చేశావు?'' అని కొత్వాలు అడిగాడు.

పాకశాలాధికారి జరిగినది చెప్పాడు.

''ఈ మనిషి నేరం ఒప్పుకున్నాడు గనక ఆ వ్యాపారస్థుణ్ణి వదిలేసి, ఇతన్ని ఉరి తీయండి,'' అని కొత్వాలు భటులను ఆజ్ఞాపించాడు.

అంతలో వైద్యుడు వచ్చి, "అసలు హంతకుణ్ణి నేను!" అని తన కథ కొత్వాలుకు చెప్పాడు. కొత్వాలు వైద్యుణ్ణి ఉరితీయమన్నాడు.

భటులు వైద్యుణ్ణి ఉరి తీసే లోపల, దర్జీవాడు వచ్చి తానే అసలు హంతకుణ్ణని తెలిపి, తన కథ అంతా చెప్పాడు.

"అసలు హంతకుడే దొరికాడు. ఇతన్ని ఉరితీయండి," అన్నాడు కొత్వాలు.

కాని ఈసారి కూడా ఒక అవాంతరం వచ్చింది. ఈ చచ్చిపోయిన మరుగుజ్జు వాడు సుల్తానుగారి విదూషకుడు. కిందటి రోజు మరుగుజ్జువాడు ఎటో వెళ్ళి మళ్ళీ తిరిగి రాలేదు. అందుచేత సుల్తాన్ ఇవాళ తెల్లవారుతూనే అతన్ని గురించి అడిగాడు. మరుగుజ్జువాడు హతుడయాడనీ, అతన్ని చంపినది నేనేనంటే నేనేనని, నలుగురు మనుషులు తగాదా పడుతున్నారనీ సుల్తానుకు తెలియ వచ్చింది. చచ్చిన మరుగుజ్జునూ, ఆ నలుగురు హంతకులనూ, తన వద్ద హాజరు పరచమని సుల్తాన్ కొత్వాలుకు కబురు పంపాడు.

అందరూ సుల్తాను సమక్షానికి చేరారు. హంతకులమని చెప్పుకునే నలుగురూ తమ తమ కథలు సుల్తానుగారికి నివేదించుకున్నారు. అందరి కథలూ వింటున్న మంగలి వైద్యుడొకడు, మరుగుజ్జు శవాన్ని పరీక్షించి, "విదూషకుడి ఒంట్లో ఇంకా ప్రాణం వున్నది," అన్నాడు. అతను విదూషకుడి నోరు బలవంతాన తెరిచి, గొంతులోకి చిమ్టా ఒకటి ప్రవేశపెట్టి, గొంతులో ఇరుక్కుని ఉన్న చేపముక్కను బయటికి లాగాడు. వెంటనే మరుగుజ్జువాడు పెద్దగా తుమ్మి, లేచి కూర్చుని, ముఖం నిమురుకుని, చివాలున లేచి నిలబడ్డాడు.

ఆ విధంగా అందరి కష్టాలూ గట్టెక్కాయి. సుల్తాను, వైద్యుడికి గొప్ప బహుమానం ఇచ్చాడు. సుల్తాను వద్ద బహుమానాలు పొంది, "హంతకు"లందరూ తమ తమ ఇళ్ళకు తిరిగిపోయారు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1983 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.







Pranlal K Patel

Devidas Kasbekar

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ జనవరి నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింప బడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఇరువురికీ ముచ్చట !

రెండవ ఫోటో : బరువెవరికి ఇచ్చట ?

పంపినవారు : యస్. వి. చలమారెడ్డి, జమ్ములమడుగు-(కడప జిల్లా)

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

బొత్తాలే,
[illegible]







"కెనరా బ్యాంకు కౌంటరుకు ఎవరు ముందు వెడతారు ?"

ఎవరు కెనరా బ్యాంకు కౌంటరుకు ముందు వెడతారు ? విన్నదే; అయినా ముగ్గురికి ఒక తమాషా అయిన ఆట. వీరికి కావలసిందల్లా కొన్ని నాణెములు మాత్రమే— నాలుగు నాణెములు మరియు మూడు గుండీలు చాలు. నిబంధనల కొరకు వెనక పేజి చూడుము.








కెనరా బ్యాంక్
(జాతీయ బ్యాంక్)



## "కెనరా బ్యాంకు కౌంటరుకు ఎవరు ముందు వెడతారు?" దానికి నిబంధనలు :

1. ప్రతి ఆటగాడు వంతులవారిగా నాలుగు నాణాల్ని ఎగురవేసి ఆట ప్రారంభిస్తారు. ఆటగాళ్ళు తమకు వచ్చ బొమ్మల సంఖ్య ప్రకారము ముందు గడులకు కదులుతారు. ఒక బొమ్మ పడితే ఒక గడి. రెండు బొమ్మలకు రెండు గడులు. మూడు బొమ్మలకు మూడు గడులు. నాలుగు బొమ్మలకు నాలుగు గడులు.
2. ఎవరికి నాలుగూ బొమ్మలే పడతాయో అతనికి మరోసారి ఆడే అవకాశము వస్తుంది.
3. కౌంటరుకెళ్ళే దారి వచ్చే ముందుగా ఆటగాళ్ళు దారి గుండా మూడుసార్లు తిరగవలసి ఉంటుంది.
4. నీళ్ళ గుంటలో పడితే ఒక అవకాశం పోగొట్టుకున్నట్లే.
5. పొదలో చిక్కుకున్నట్లయితే రెండవకాశాలు పోయినట్లే.
6. కొండ ఎక్కడం అంటే ఒక అవకాశం లాభం పొందినట్లే.




# కెనరా బ్యాంకునుండి ఉచితం స్టిక్కర్స్

మీ బాలక్షేమ లేక మైనరు ఖాతా ఉన్న కెనరా బ్యాంకు శాఖనుండి స్టిక్కర్స్‌ను తీసుకొండి.

**నీవు మైనరు అయితే ఏం ?**

నీవు కెనరా బ్యాంకులో నీకొరకు ఒక ఖాతాను ప్రారంభించమని నీ తల్లికిగాని తండ్రికిగాని చెప్పు. నీవు పద్నాలుగేండ్ల వాడవైన వెంటనే నీవే ఒక ఖాతాను సొంతముగా ప్రారంభించి నడపవచ్చును. చిన్న మొత్తమైన అయిదు రూపాయలతోనే నేడే ఖాతా ప్రారంభించి ఆ ఆనందాన్ని నీవే పొందు.

**విద్యానిధి :** నీవు డాక్టరువి కావాలను కొంటున్నావా ? లేక ఇంజనీరా ?? లేక సైంటిస్టా ??? అయితే దానికి జవాబు విద్యానిధి. నీ తల్లిదండ్రులతో నేడే ఒక ఖాతాను ప్రారంభించమని చెప్పు. నీ ఉన్నత విద్యాభ్యాసం నీకూ చింత లేనిదిగా వుంటుంది.

**బాలక్షేమ :** చురుకైన పిల్లలు తమ పాకెట్‌మనీ నంతటిని ఖర్చు పెట్టరు. కొంత కెనరా బ్యాంకు టి.వి. బాక్స్‌కోసం దాస్తారు. తెలివిగా ప్రవర్తించండి. మీ తల్లి దండ్రులను కెనరా బ్యాంకులో "బాలక్షేమ" ఖాతాను ప్రారంభించమని అడగండి. నాణేల్ని టి.వి. డబ్బాలో వేస్తూ అవి వృద్ధి చెందడం గమనించు. నీ కలలన్నీ నిజమవుతాయి.





## కెనరా బ్యాంక్
(జాతీయ బ్యాంక్)

**Results of Chandamama—Camlin Colouring Contest No. 26 (Telugu)**

*1st Prize:* P.N.G. Suresh, Rayagada. *2nd Prize:* M. Prasad, Madras-17. M. Varma, Visakhapatnam. K. Madhuri, lazipet. *3rd Prize:* V. Ram Mohan Reddy, Hyderabad. T. Venktesh, Hyderabad-4. P. Vijay Kumar, Mahebubnagar. P. Jagadish, Vijayawada-520 010. V.V. Satheeshkumar, Waltair. M. Aruna Sree, Warnagal. Punk Anil Kumar, N.K. Agraharnamz. T. Vani, Bangalore-11. Nimmana Raju, Talpukur. A. Raga Maduri, Hyderabad.

## జీవన్ హనూల చర్చ

# కుక్కలూ వాటి సాహసకార్యాలు

కుక్క, విశ్వాసమైన జంతువు. మనిషితో సహవాసంగా, వేరు వగావుండే పెంపుడు జంతువుల్లోకల్లా ఎక్కువ విశ్వాసం గలది కుక్క. అంతే కాదు, కుక్క తన తెలివితేటలతో, ధైర్యంతో, సాహస కృత్యాలుచేసి, మనిషిని ఎన్నో అపాయాల్నుంచి రక్షిస్తుంది—మనిషిని తన ఆత్మ మిత్రుడిగా భావిస్తుంది.

రికే అనే వేల్స్ దేశపు గొర్రెలను కాచే కుక్కకి రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో భూమిలో కప్పెట్టిన బాంబులను పసికట్టడంలో తర్ఫీదునిచ్చారు. 1944లో ఒక సారి, అలా భూమిలో కప్పెట్టిన బాంబు -మైన్ హఠాత్తుగా పేలి. రికేకి, వెంటవున్న యజమానికీ ప్రమాదకరమైన గాయాలు తగిలాయి. ప్రమాదకరమైన ఆ బాంబులు గల ప్రదేశంలోకి చొరబడి వాళ్ళని రక్షించడానికి ఎవ్వరూ సాహసించలేరు. అప్పుడు రికే పసిగట్టి, భద్రంగా, డాక్టరుని తీసుకెళ్ళింది కొనఊపిరితో వున్న యజమాని దగ్గరికి.



మరో అద్భుతమైన రక్షణగాధ గోల్డెన్ రిట్రీవర్, లాడీది. 1947లో బీచ్‌లో ఆడుతోందది; కెవ్వునకేకవింది....నావలో మునుగుతూన్న యిద్దరు కుర్రాళ్ళు. తక్షణమే లాడీ దూకి వాళ్ళని తన కాలర్‌ని పట్టుకోమని సంజ్ఞచేసింది. వాళ్ళిద్దరినీ ఒడ్డుకి లాక్కొచ్చింది, వాళ్ళ నావతో సహా.





స్విజర్లాండ్‌లోని ఆల్ప్స్ పర్వతాలలోని సెయింట్ బెర్నార్డ్‌లు మంచులో కూరుకుపోయిన వాళ్ళని రక్షించడం కోసం తర్ఫీదునిస్తారు. గడచిన 300 ఏళ్ళలో 2500 జీవితాలని రక్షించాయవి! సెయింట్ బెర్నార్డ్ వెంట ఎప్పుడూ ఒక బ్రాందీ సీసా వుంటుంది మంచులో కూరుకుపోయిన వారికి వెచ్చదనం యివ్వడానికి. అన్నిటిలోకి ప్రఖ్యాతి చెందిన దాని పేరు, బేరీ—1800 సంవత్సరంలో చనిపోయేసరికి 40 మందికిపైగా రక్షించిందది.



'సీయింగ్ ఐస్' కుక్కలు, అంధులైన యజమానులకు కళ్ళు లాంటివి—అవి 'గైడ్' చెయ్యడానికి, రక్షించడం సమా తర్ఫీదు యివ్వబడినవి. ఆ కుక్క తన యజమానిని కిక్కిరిసిన రోడ్ల నుంచి దాటిస్తుంది, ఎదుర్కొనే వాళ్ళ నుంచి రక్షిస్తుంది. అంతే గాక యజమానియిచ్చే ఆజ్ఞలవల్ల ప్రాణహాని కలుగుతుందని పసిగడితే, ఆమాట వినదు కూడాను.



జీవన భీమా మీకు యావజ్జీవిత మిత్రుడిలాంటిది, మిమ్మల్ని విశ్వాసంతో కాపాడుతూ రక్షణను కల్పిస్తుంది. అదేమిటో, ఎలాగో తెలుసుకోండి.



జీవిత భీమా అనేది మీ కుటుంబాన్ని సురక్షితంగా ఉంచుకోడానికి అతి భద్రమైన మార్గం. దాన్ని గురించి తెల్సుకోండి.



**లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా**

daCunha/LIC/133/82 TL

# పాపిన్స్ తంత్ర

రాము, శ్యాము
చెబుతారొక కథ బలేగా
రారండోయ్ పిల్లల్లారా
వినండి మీరు శ్రద్ధగా








ఎలక, ఏనుగు ఎదురుపడ్డాయి ఒకదానికొకటి
ఎలకంది కదా "ఏనుగుమామా, మనలో భేదం ఏమిటి?
నీ రంగు నలుపు, నలుపే నా రంగు
తోక నీకుంటే, నాకూ వుందా హంగు
నాలుగు కాళ్లు ఉన్నాయి నీకు
నాలుగు కాళ్లు మరి లేవా నాకు
రొండమెత్తు మీరు తింటారు మీ తిండి
పళ్లతోనే మేము నమిలి మింగేస్తామండి."
నవ్వుతూ ఏనుగు ఎలకతో అంది
నేస్తం కడదాము రా రమ్మంది

"నీ మాటలెంతో నాకు నచ్చాయి
కలపవోయి మిత్రమా స్నేహంగా చెయ్యి"
బరువైన తన చెయ్యి ఎత్తింది ఏనుగు
భయంతో చిట్టెలక పుచ్చుకుంది పరుగు
అందుకే ఓ పిల్లల్లారా మీరూ వినండి శ్రద్ధగా
అందరూ ఎప్పుడూ ఉండాలి ఎంతో మెలకువగా
తినకండి సుమా నకిలీ పాపిన్స్ మీరు
కడుపు నొప్పితో ఆనక బాధపడతారు.




నకిలీవాటి మోసంలో పడనే వద్దు
అలాంటివెప్పుడూ మనకొద్దే వద్దు
అందమైన వెండి చారలు ఉన్నాయేమో చూడండి
అసలైన పాపిన్స్ పాకెట్ అదే అని గ్రహించండి